భారతీయ సాహిత్య నిర్మాతలు




మూలం

ప్రకాశ్ చంద్ర గుప్త

అనువాదం

బి. రామరాజు



సాహిత్య అకాడెమి

న్యూఢిల్లీ

# I

క్రీ. శ. 1880 నుండి 1936 వరకు ప్రేంచంద్ యుగం. భారతదేశ చరిత్రలో ఇది చాలా ముఖ్యమైన కాలం. ఈ కాలంలోనే భారతదేశ స్వాతంత్ర్యోద్యమం శక్తిని వేగాన్ని పుంజుకొన్నది. భారతజాతీయకాంగ్రెస్ మితవాదుల నాయకత్వాన ప్రారంభమైనది. కాని క్రమంగా రెండవ దశాబ్దంనాటికి గాంధీగారి అదుపులోనికి వచ్చింది. అప్పటికి గాంధీగారిని అతివాది అనేవారు. గాంధీగారు బ్రిటిష్ ప్రభుత్వ బలాన్ని ఎదిరించటానికి ప్రజోద్యమం సాగించ తలపెట్టినారు. అంటే సుఖమైన వాలుకుర్చీల రాజకీయాలు వదలి కారాగారవాసాన్ని బాధలను వరించటమన్న మాట. 1936 లో ప్రేంచంద్ కీర్తిశేషుడయ్యేనాటికి గాంధీగారి రాజకీయమార్గం శాంతంగాను ఉదారంగాను ఉన్నట్లు కనుపడసాగింది. అతివాదులు కొందరు రంగంలో ప్రవేశించి స్వాతంత్ర్య ముఖ్యోద్దేశంగా ఆర్థిక రాజకీయ విషయాలను సామ్యవాద దృక్పథంతో నిర్వచించ పూనుకొన్నారు. ఇందులో నెహ్రూ వంటి వ్యక్తులు, ఇంకా అనేక వామపక్షులవారు ఉండిరి.

పరిపక్వమౌతున్నటువంటి జాతీయోద్యమవేగంతో సమానంగా సాగిపోవటానికి ప్రేంచంద్ తన జీవితమంతా ప్రయత్నించినాడు. గోఖ్లే వంటి మితవాదులు కాంగ్రెస్ ఆధిపత్యం వహించినప్పుడు ప్రేంచంద్ గాంధేయ అతివాదిగా ఉండేవాడు. తర్వాత తర్వాత కర్షకుల, కష్టజీవుల ఆర్థిక విమోచనం గురించి తీవ్రంగా ఆలోచించటం మొదలుపెట్టినాడు. చివరి దినాలలో ప్రేంచంద్ గాంధీ మార్గంకంటె నెహ్రూ మార్గాన్నే అనుసరించినాడు.

1857 నాటి విప్లవం తరువాత భారతదేశం ఆధునికతాప్రకాశాన్ని కొద్ది కొద్దిగా సంతరించుకోవటం మొదలుపెట్టింది. ఈ మార్పు నెమ్మదిగాను కష్టంగాను ప్రారంభమైనది. మధ్యయుగీన తిరోగమనశక్తులు దానిని వెనుకకు మళ్ళించేవి. రైలు సౌకర్యాలు, తంతి సౌకర్యాలు, నల్లానీళ్ళు, ఆధునిక పాఠశాలలు, పాశ్చాత్య శాస్త్రవిజ్ఞానము భారతదేశంలో ఒక క్రొత్త దృక్పథాన్ని దూరదృష్టిని ప్రవేశపెట్టినవి. పల్లెలలోని జమీందారీ సంబంధాలు, పట్టణాలలోని కులతత్వము, అస్పృశ్యత

మతవిద్వేషాలు, అభ్యుదయమార్గానికి ప్రబలనిరోధకాలుగా ఉండేవి. ప్రేంచంద్ కృషి భారతదేశపు ఈ వైవిధ్యదృశ్యాన్ని పరస్పరవిరుద్ధ శక్తులను సంపూర్ణంగా ప్రతిబింబిస్తది.

ప్రేంచంద్ పాశ్చాత్య పద్ధతులను సంస్థలను గ్రుడ్డిగా అనుకరించటాన్ని విరోధించేవాడు. ఆతడు నిజమైన భారత పుత్రుడు; భారత భూమికి ప్రగాఢంగా హత్తుకపోయినవాడు. ఆయన మన సాహిత్యంలో భారతీయ కృషీవల జీవితాన్ని మనోహరంగా వ్యాఖ్యానించినవాడు. ప్రాణవంతమూ స్వచ్ఛదేశీయతా గుణశోభితమూ ఐన ఆతని వ్యక్తిత్వం పాశ్చాత్యవిద్యాప్రభావితులైన భారతీయుల దాంభికత్వానికి పూర్తిగా భిన్నమైనది.

రవీంద్రనాథ్ టాగోర్ సాహిత్యపు వారసత్వాన్ని ప్రేంచంద్ సామ్యవాదోన్ముఖంగా మరికొంత అభివృద్ధి చేసినాడనే చెప్పుకోవాలె. సమకాలీన వాస్తవికతకు అత్యవసరమైన మౌలికమైన మార్పులు కోరే అంశాలను ఆతడు అందులో చొప్పించినాడు. టాగోర్‌తో పోల్చి చూస్తే ప్రేంచంద్ ఎక్కువగా వాస్తవిక జగత్సంచారిగా కనుపడుతాడు. ప్రాచీన భారతీయ సంస్కృతి వారసత్వంలో టాగోర్‌కు ఉన్న ఆధ్యాత్మిక అంతర్దర్శనం అతనిలో లేదు. కాని శాస్త్రీయమూ అభ్యుదయకరమూ ఐన విశ్వమానవదృష్టినుండి వ్యుత్పన్నమైన ఆధునిక భావనలతో ఎక్కువగానే సమేళం పొందినట్లుగా కనుపడుతాడు. భారతీయ సంస్కృతికి ముస్లింలు చేసిన కృషిని ఆయన స్వచ్ఛంగా, ప్రగాఢంగా, మతంతో ప్రమేయం లేకుండా గుర్తించినాడు.

భారతదేశంలో అతి వేగంగా ముందుకు పొగుతుండిన బ్రహ్మాండమైన పారిశ్రామిక వాదానికి ప్రేంచంద్ విరోధి. కర్మాగారాలు ఎక్కువైతే కర్షకుడు తన భూమిని కోలుపోతాడనీ, సామాన్య కష్టజీవి దౌర్జన్యానికి గురి ఔతాడనీ, జీవితమూ సంస్కృతీ అసభ్యమైపోతాయనీ, సాంఘిక వ్యతిరేక శక్తులు తలయెత్తుతాయనీ, ఆయన అభిప్రాయం. తనకు కలిగిన ఈ భయసందేహాలు ప్రేంచంద్ తన విపులమైన నవల—రంగభూమిలో స్పష్టంగాను, శక్తివంతంగాను ప్రకటించినాడు. యంత్రాలు మానవుల కాయకష్టాన్ని తొలగిస్తాయని ఆయన గుర్తించలేకపోయినాడు. నిజానికి ధనికవర్గసంబంధాలే పారిశ్రామికీకరణాన్ని విషఫలంగా మారుస్తవి.

ప్రేంచంద్ సాహిత్యంలో దేశభక్తి భావాలు బలీయంగా కనిపిస్తవి. ఆయన సాహిత్యకృషికి వెనుక రాంమోహన్‌రాయ్, వివేకానంద, దయానంద, గాంధీ,

టాగోర్, నెహ్రూ, భగత్‌సింగ్, చంద్రశేఖర్ ఆజాద్ : ఐరోపా స్వాతంత్ర్య వీరులూ, మానవ విమోచనోద్యమ కర్తలూ ఐన మజ్జినీ, గారిబాల్డీ, కార్ల్‌మార్క్స్, లెనిన్ ప్రభృతుల గొంతుకల నిరంతర ప్రతిధ్వనులు మనకు వినిపిస్తవి.

## II

ప్రేంచంద్ 1880 జులై 31 నాడు 'లమహీ' అనే గ్రామంలో పుట్టినాడు. ఆ గ్రామం వారణాసికి నాల్గుమైళ్ళ దూరంలో ఉన్నది. ఆయన మర్యాదగల ఒక నిరుపేద కాయస్థకుటుంబంలో పుట్టినాడు. ఆ కుటుంబానికి ఆరు బిగాల భూమి ఉండేది; కాని కుటుంబం చాలా పెద్దది. ప్రేంచంద్ తాత గురుసహాయలాల్ పట్వారీగా ఉండేవాడు. ప్రేంచంద్ తండ్రి అజైబ్‌లాల్ తపాలా కార్యాలయంలో గుమాస్తాగా ఉంటూ నెలకు ఇరువైయైదు రూపాయలు సంపాదించేవాడు. ప్రేంచంద్ తల్లి ఆనందీదేవి ఉదాత్తప్రకృతిగల మంచి రూపసి, సుస్వభావ. ఆమె "బడే ఘర్‌కీ బేటీ" ని గుర్తు చేస్తది. ఈ కథానాయిక పేరుకూడ ఆనందీదేవి అని మనం గుర్తుంచుకోవాలె.

ప్రేంచంద్ బాల్యం పల్లెటూరిలోనే గడచినది. ఆటకోయితనం, ఉత్సాహం, చేనుచెలుకలలో చిన్నచిన్న దొంగతనాలు చేయటం ఆతని బాల్యవిశేషాలు. ప్రేంచంద్‌కు తీపి అంటే మహా యిష్టం. అందులో బెల్లం అంటె అమితప్రీతి. ఆతని బాల్యవిద్యాభ్యాసం లమహీలోనే సాగినది. అక్కడనే ఒక మౌల్వీగారివద్ద కొంచెం ఉర్దూ కొంచెం ఫార్సీ నేర్చుకొన్నాడు. ఆయన ఒకసారి రూపాయి దొంగిలించినందుకు కఠినశిక్ష కూడ అనుభవించినాడట. "కజాకీ" అనే కథ ఆతని బాల్యస్మృతులు ఆధారంగా వ్రాసినదే. కజాకీ అనేవాడు తపాలా బంట్రోతు. కజాకీ చాలా దూరదూరాలు ప్రయాణం చేసేవాడు. తిరిగివచ్చినప్పుడల్లా బాలుడైన ప్రేంచంద్‌కు ఏవో వస్తువులు తెచ్చేవాడు. ఈ కథానికలో కజాకీ ప్రేంచంద్‌కు ఒక జింకపిల్లను తెస్తాడు అధికారులు ఆతణ్ణి ఉద్యోగంనుండి తీసివేస్తారు. జింకపిల్లను వెంటాడుతూ ఆతడు చాలాసేపు పోయినందున తపాలా ఆఫీసుకు ఆలస్యంగా వస్తాడు. విధి నిర్వహణంలో జరిగిన ఈ అశ్రద్ధకు శిక్షగా ఆతణ్ణి ఉద్యోగం నుండి తొలగిస్తారు. కజాకీఅచ్చమైన స్వాభిమానము గాంభీర్యము మానవత్వములతో నిండారినా కారుణ్యపయఃప్రవాహం అతివేలంగా జీవనాడుల్లో కలిగిన పాత్ర.

ప్రేంచంద్ అనేది ఈ రచయిత చాలాకాలం తరువాత పెట్టుకొన్న కలం పేరని గుర్తుంచుకోవాలె అతనికి తలిదండ్రులు పెట్టిన పేరు ధన్‌పత్‌రాయ్. ప్రభుత్వోద్యోగిగా ఉంటూ కథానికలు వ్రాస్తుండినప్పుడు నవాబ్‌రాయ్ అనే కలంపేరు పెట్టుకొన్నాడు. అతణ్ణి చాలామంది జీవితాంతం నవాబ్ అనే వర్ణించేవారు. అతని 'సోజెవతన్' అనే ప్రథమ కథానికల సంపుటాన్ని ప్రభుత్వం నిషేధించగానే అతడు నవాబ్‌రాయ్ అనే మారుపేరును విడిచిపెట్టినాడు. అటుతరువాతి రచనలన్నీ ప్రేంచంద్ అనే కలంపేరుతోనే వచ్చినవి.

అతని చిన్ననాటి చిత్రణం "చోరీ" అనే కథానికలో కనుపడుతది.

"ఓ బాల్యమా! నిన్ను మరచిపోలేను. శిథిలమైన ఆ మట్టియిల్లు, గడ్డి పడక, దిసమొల, బరికాళ్ళతో చేనులలో తిరగటం, మామిడి చెట్లు ఎక్కటం — ఇవన్నీ నాకు స్పష్టంగా జ్ఞాపకం ఉన్నవి. ఈనాడు ఫ్లెక్స్ బూట్లు తొడుక్కుంటే కలిగే సంతోషంకంటె ఆనాడు పల్లెటూరి పాదరక్షలు తొడుక్కున్నందున కలిగిన సంతోషమే ఎక్కువ. ఈనాటి గులాబీ పానకంకంటె ఆనాటి వేడివేడి వట్టి మామిడి రసమే రుచికరంగా ఉండేది. పుట్నాలు, పచ్చిరేగ్గాయలు ద్రాక్షలకన్నా మంచి మిఠాయికన్నా తియ్యగా ఉండేవి.

'నేను మా పితృవ్యసోదరుడు హలధరునితో కలసి ఒక మౌల్వీగారివద్ద చదువుకోవటానికి పొరుగూరికి పోయేవాణ్ణి. అప్పుడు నా వయస్సు ఎనిమిదేండ్లు. హలధరుడు (ఇప్పుడు స్వర్గవాసి) నాకంటె రెండేండ్లు పెద్దవాడు. ప్రొద్దున చద్దిరొట్టె తిని పగటికోసం పుట్నాలు బటానీలు తీసుకపోయేవాళ్ళం. దినమంతా మాదే. మౌల్వీగారు అటెండెన్స్‌రిజిస్టరు పెట్టక పోయేవారు. రానివాళ్ళకు జురుమానా కూడా వేయకపోయేవారు కనుక భయపడవలసిన అవసరమేమీ లేకపోయేది. ఒకప్పుడు పోలీస్ స్టేషన్ దగ్గర జరిగే రక్షకభటుల కవాతును చూస్తూ, ఒకప్పుడు గారడీవాడు గుడ్డేలుగునో కోతినో ఆడిస్తుంటే వాని వెంట తిరుగుతూ దినమంతా గడిపేవాళ్ళం. ఒకప్పుడు రైలు స్టేషనుకు పోయి వచ్చిపోయే ధూమశకటాలను చూచేవాళ్ళం. రైల్వే టైంటేబులుకు తెలిసినదానికంటె రైళ్ళ గురించిన విశేషాలు మాకే బాగా తెలుసు. మేము నడిచే త్రోవలో ఒక పట్టణపు వడ్డీ వ్యాపారి ఒక తోట వేయించి ఒక బావి త్రవ్విస్తుండె. ఇది కూడ మాకొక పెద్ద వింతగా ఉండేది. ఆ ముసలి తోటమాలి తన గుడిసెలోనికి మమ్ముల ఎంతో ఆదరంతో ఆహ్వానించేవాడు. అతనితో పోట్లాడి అతడు వేయవలసిన కాయకష్టం మేము చేసే

వాళ్ళం. బకెటుతో చెట్లకు నీళ్ళు పోసి, పాదులు కట్టి, తీగల ఆకులు అందంగా కత్తె రతో కత్తిరించేవాళ్ళం. ఈ పని ఎంత ఆహ్లాదకరంగా ఉండేది! ఆ తోటమాలి శిశుమనస్తత్వం బాగా ఎరిగినవాడు. మాకేదో మహోపకారం చేసినట్లుగా తన పని అంతా మాతో చేయించేవాడు. ఆతనికి దినమంతా పట్టే పని మేము ఒక గంటలో చేసేవాళ్ళం.

"ఒక్కొక్కసారి వారాల తరబడి మేము బడి ఎగగొట్టేవాళ్ళం. కాని మేము చెప్పే గట్టి సాకులు నమ్మి మౌల్వీగారు తమ కోపాన్ని వెంటనే దులిపి వేసుకొనేవారు. ఆనాడు నాకుండిన కల్పనాశక్తి ఈనాడుంటేనా అందరు ఆశ్చర్య పడేటటువంటి ఒక నవల వ్రాసేవాణ్ణి. ఈనాడు అపారమైన వేదన పడితేగాని ఒక్క కథకు కావలసిన యితివృత్తం లభిస్తది. వృత్తిరీత్యా మా మౌల్వీగారు బట్టలు కుట్టేవాడు. చదువు చెప్పటం ఆయనకు సరదా మాత్రమే. ఆయనగారి పని తనం మా సోదరులం మా వూరి కుర్మీలముందు కుమ్మరివాళ్ళముందు అధికంగా పొగడేవాళ్ళం. మౌల్వీగారికి మేము పర్యటన చేసే ఏజెంట్లవంటి వాళ్ళం. మా ప్రయత్నం మూలంగా మౌల్వీగారికి స్వల్పమైన పని లభించినా మాకు అపారమైన సంతోషం కలిగేది. మేము బడికి రానినాడు చెప్పటానికి తగిన సాకు దొరకకపోతే మౌల్వీ గారికి ఏవో చిన్నకానుకలు తీసుకపోయేవాళ్ళం. కాయల మూటో, ఐదారు చెరుకుగడలో, లేకపోతే గోధుమ, యవల కంకులో తీసుకపోయేవాళ్ళం. మౌల్వీ గారి కోపోపశమనానికి ఈ కానుకలు సత్వరంగా పనిచేసేవి. ఏమీ లభించని ఋతు వులో దండనం తప్పించుకోవటానికి ఏవో క్రొత్తమార్గాలు వెదకేవాళ్ళం"—

బాల్యంలో ప్రేంచంద్‌కు చిల్లగోనె (గోటీబిళ్ళ) గాలి పటాలు ఎగరవేయటం అభిమానక్రీడలు. చిల్లగోనె మీద ఆతనికుండిన అభిమానం ఆతడు వ్రాసిన ఒక అత్యుత్తమ కధానికలో కనుపడుతది. "దానికోసం ఒక పచ్చికబయలు గాని ఆట మైదానంగాని అవసరంలేదు. ఒక వలగాని ఒక పన్నుగడ కాని పన్ననవసరం లేదు. చెట్టు కొమ్మ విరిచి ఒక చిల్ల ఒక గోనె చేసుకుంటె ఇద్దరితో ఆట ప్రారం భించ వచ్చు..... .చిన్ననాటి మధురానుభూతులన్నింటిలో ఇదే మధురతమ మైనది."—

"చోరీ" అనే కథలో హలధరునితో కలిసి తమ యింటినుండి ఆతడు ఏవిధంగా ఒక రూపాయి దొంగిలించినది చెప్పుతాడు "స్నానం చేసి మేము ఇంటికి తిరిగివచ్చి అమిత భయంగా లోపల అడుగుపెట్టినాము ఇప్పుడు కనుక మా జేబులు వెదికినట్లైతే భగవంతుడే రక్షించాలె కాని అందరు ఎవరి పనులలో

వాళ్ళు మునిగి ఉన్నారు. మమ్ముల ఎవ్వరూ పల్కరించలేదు. మేము ఉపాహారం చేయటంకాని, తినటానికి వెంట ఏమైనా తీసుకపోవటంగాని ఏమీ చేయలేదు. పుస్తకాలు చంకన పెట్టుకొని మా బడి దారి పట్టినాము

అది వానకాలం. ఆకాశమంతా మేఘావృతమైనది. మేమిద్దరం నూరు ఉపాయాలాలోచిస్తూ గాలిమేడలు కడుతూ అమితసంతోషంతో మా బడివైపు సాగినాము ఇది మంచి అదృష్టమైన దినం. ఈ రూపాయిని మేము చాలాకాలం వాడుకోవాలెనని అనుకొన్నాము. ఆ దినాలలో ఐదు పీసాలకు ఒక సేరు మంచి మిఠాయి దొరికేది గొంతుబంటి తినటానికి నిజంగా మా కిద్దరికీ ఒక అర్ధసేరే చాలు. కాని మిఠాయి కొనుక్కొని తింటే ఒక్కనాడే వ్యయమైపోతదనుకొన్నాము; ఏదో చవకగా దొరికేవి తిని కడుపులు నింపుకొని తక్కువ వ్యయంతో ఎక్కువ సంతోషం పొందాలె అనుకొన్నాము జామపండ్లు కొనుక్కోవటానికి నిర్ణయించుకొన్నాము. రెండుపైసల జామపండ్లు కొన్నాము. ప్రతిదీ అగ్గువగా దొరికే కాలం అది రెండుపైసలకు పన్నెండు పెద్ద జామపండ్లు వచ్చినవి. మా యిద్దరి అంగీలు నిండిపోయినవి. హలధరుడు జామపండ్లమ్మే స్త్రీకి రూపాయి యిస్తే ఆమెకు అనుమానం వేసి "ఈ రూపాయి మీకెక్కడ దొరికింది? దొంగిలించినారా?" అని అడిగింది.

'సమాధానం చెప్పటానికి ఇదివరకే సిద్ధపడి ఉన్నాము. ఎక్కువకాకపోయినా ఏదో ఒకటిరెండు పుస్తకాలు చదివినవాళ్ళంగదా! ఆ విజ్ఞానం మా మీద కొంత ప్రభావం చూపింది. వెంటనే "మౌల్వీ గారికి ఫీసు చెల్లించ వలసి ఉన్నది. ఇంట్లో చిల్లర లేనందున మా పెదనాయనగారు రూపాయి యిచ్చినార"ని నేను సమాధానం చెప్పినాను.'

ప్రేంచంద్‌కు బెల్లం మీద ఉన్న ప్రీతి 'హోలీ' అనే కథలో కనిపిస్తది.

'మా అమ్మ మూడునెల్లకోసం తల్లిగారింటికి పోయింది. ఆ వ్యవధిలో నేను మడుం బెల్లం తిన్నాను. అది పంచదార తయారుచేసే ఋతువు. తాతగారు జబ్బుపడి మా అమ్మగారిని పిలిపించుకొన్నారు. నాకు పరీక్షలు సమీపించటం వలన నేను అమ్మతో వెళ్ళలేకపోయినాను. తల్లిగారింటికి పోయేముందు అమ్మ ఒక మడుం బెల్లం నిలువచేసి ఒక పెద్దకుండలో ఉంచి మట్టి మెత్తువేసి పెట్టింది. కుండ మూత తెరువవద్దని నాకు గట్టిగా చెప్పింది. నా కోసం కొంచెమంత బెల్లం ఒక గురిగిలో పెట్టింది. ఒక్కవారంలోనే ఆ గురిగిలోని బెల్లం ఒడిపించినాను,

ప్రొద్దున పాలతోను పగలు రొట్టెతోను అపరాహ్ణం పుట్నాలతోను రాత్రి పాలతోను ఆ బెల్లం తినివేసినాను. ఇంత వరకు తినటం సమంజసంగానే ఉన్నది. మా అమ్మ కూడా దీనికి అభ్యంతరం పెట్టదు. కాని దప్పికావటం వలన నేను పదే పదే ఇంటికి వచ్చేవాణ్ణి. వచ్చినప్పుడల్లా ఒకటో రెండో బెల్లంముక్కలు తినేవాణ్ణి. ఇంత దుబారా తిండికి నా కోసం పెట్టిన బెల్లం ఎక్కడ చాలుతది? బెల్లం మీద ఉన్న లాలస నా పాలిటికి మనాది ఐనది.'

ప్రేంచంద్ తల్లి ఆరుమాసాలు మంచానపడి కాలం చేసింది. అప్పుడాతడు ఎనిమిదో తరగతిలో ఉన్నాడు. రెండేండ్ల తరువాత ఆయన తండ్రి మరల పెండ్లి చేసుకొన్నాడు. ప్రేంచంద్ జీవితంలో సవతి తల్లి ప్రవేశించినది. ఆయన రచనలలో సవతి తల్లి ఇతివృత్తం పదే పదే వస్తది. తల్లి లేనిలోటు ఆతని జీవితంలో సవతితల్లి తీర్చలేకపోయిందని స్పష్టంగా తెలుస్తది.

ఈ కాలంలోనే ప్రేంచంద్‌లో నవలలు చదివే తీవ్రాసక్తి బాగా పెరిగింది. ఒక పొగాకువ్యాపారి కొట్టువద్ద 'తిలిస్మె హోష్రుబా' అనే అనంతమైన కథలు విన్నాడు. అది కల్పనాకథల విజ్ఞాన సర్వస్వం వంటిది. అక్బర్ వినోదం కోసం ఫైజీ అనే రచయిత దీనిని ఫారసీలో వ్రాసినాడంటారు. దాదాపు ఒక సంవత్సరం వరకు ప్రేంచంద్ ఈ కథలు వరుసగా విన్నాడు అది ఆతని కల్పనా శక్తిని బాగా ప్రేరేపించినది.

రతన్‌నాధ్‌సర్‌షార్ వ్రాసిన నవలలు, రేనాల్డ్స్ వ్రాసిన 'ది మిస్టరీస్ ఆఫ్ ది కోర్ట్ ఆఫ్ లండన్' అనే గ్రంథం మొదలైనవి కూడా ప్రేంచంద్ చదివినాడు. గోరఖ్పూర్ వాస్తవ్యుడు బుద్ధిలాల్ అనే పుస్తక విక్రేతతో ప్రేంచంద్ మైత్రి చేసుకున్నాడు. ఆతని వద్ద దొరికే వల్లెవేత పుస్తకాలు ప్రేంచంద్ తన బడిలో అమ్మిపెట్టేవాడు. అందుకోసం అతడు ప్రేంచంద్‌కు ఇంటివద్ద చదువుకోవటానికి కొన్ని నవలలు ఇచ్చేవాడు. రెండుమూడేండ్లలో ఈ విధంగా ప్రేంచంద్ కొన్ని నూర్ల నవలలు చదివి ఉంటాడు.

గోరఖ్పూర్‌లోనే ప్రేంచంద్ తన తొలి సాహిత్యసృష్టి చేసినాడు. అది ఒక ప్రహసనం బ్రహ్మచారి చిన్నాయన ఒక తక్కువకులం స్త్రీని ప్రేమించినకథ దీని యితివృత్తం. ప్రేంచంద్ నవలలకు అలవాటు పడటాన్ని ఆ చిన్నాయనగారు గర్హించేవాడు ఆ పగ తీర్చుకోవటానికి ప్రేంచంద్ చిన్నాయన ప్రేమకలాపాన్ని

నాటకంగా వ్రాసినాడు. ప్రేంచంద్ ఈ తొలిసాహిత్యకృషి ఈ నాడు మృగ్యం. భంగపడిన అతని చిన్నాయన బహుశః దానిని అగ్నికి అహుతి చేసి ఉంటాడు.

# III

ప్రేంచంద్ తనది ఒడుదొడుకులు లేని జీవితమని చెప్పుకొన్నాడు అతని జీవితంలో అసాధారణమైన విచిత్ర సన్నివేశాలేమీ లేవు. అతని జీవితచరిత్ర అంతా ఒకచోటినుండి మరొకచోటికి ఉద్యోగరీత్యా మారటంతోను. రచనలు ప్రచురించిన తేదీలతోను నిండి ఉంటది. ఒక స్నేహితునికి ఆయన తన జీవిత సంగ్రహాన్ని ఈ విధంగా తెలుపు కొన్నాడు.

"పుట్టినది విక్రమశకం 1937. తండ్రిపేరు మున్షీ అజైబ్‌లాల్. నివాసం లమహీ, మర్హ్వాన్‌గ్రామం, పాండీపూర్, బనారస్. ఫారసీతో చదువు ప్రారంభమై ఎనిమిదేండ్లు సాగినది. అటు తరువాత ఇంగ్లీషు చదువు. బనారస్‌లో ఒక కళాశాలకు అనుబంధంగా ఉన్న హైస్కూలులో ఎంట్రెన్స్ పరీక్షలో కృతార్థత. నాకు పదిహేనేండ్ల వయస్సున్నప్పుడే నాయనగారు చనిపోయినారు. ఏండేండ్లప్పుడే కన్నతల్లి చనిపోయింది. విద్యాశాఖలో ఉపాధ్యాయుడుగా ఉద్యోగం ప్రారంభించినాను. సాహిత్యజీవితం 1901 నుండి ప్రారంభమైనది"

ఆయన తన అసంపూర్ణస్వీయచరిత్రలో తన జీవితాన్ని ఇదివరకే పేర్కొన్నట్లు, ఇట్లా సంక్షిప్తపరచినాడు. నా జీవితం ఒక సమతలం. అక్కడక్కడ ఏవో కొన్ని గోతులున్నవే కాని, ఉన్నత శిఖరాలు, పర్వతాలు, నిబిడారణ్యాలు, అగాధమైన లోయలు కాని శిధిలాలు కాని లేవు. పర్వత శిఖరాలపై విహరించగోరే వారికి ఇక్కడ నిరాశ తప్ప మరేమీ లేదు".

ప్రేంచంద్ పదిహేనవయేట తొమ్మిదో తరగతి చేరుకొన్నాడు. బనారస్‌లోని క్వీన్స్ కాలేజిలో చదివేవాడు. నెలకు ఐదురూపాయలు కర్చుపెట్టేవాడు. ప్రొద్దున తన గ్రామంనుండి పుట్నాలు బెల్లం పొట్లం కట్టుకొని బయలుదేరేవాడు. దినమంతా బడిలో చదువుకొని సాయంకాలం ఇంటికి చేరుకొని రాత్రి చమురు దీపపు వెలుతురులో చదువుకొనేవాడు.

ప్రేమ్‌చంద్‌కు పదిహేనేండ్లవయస్సులో వివాహం జరిగినది. ఆయన మాతామహుని సవతి తమ్ముడు ఈ సంబంధం కుదిర్చినాడు. కొన్ని ఆధారాల

మూలంగా ఆ పిల్ల రూపసి కాదని కనీసం శిష్టాచారం ఎరిగినది కూడా కాదని తెలుస్తున్నది. ఆమె వట్టి జగడాలమారిది కావటంతో ఆ దంపతుల ప్రేమజీవితం ఆదిలోనే వికలమై భగ్నమై పాడై పోయినది.

ఈ పెండ్లి ఐన కొద్దికాలానికే ప్రేంచంద్ తండ్రి మంచం పట్టి దీర్ఘవ్యాధితో చనిపోయినాడు అది 1897 వ సంవత్సరం. ప్రేంచంద్ మెట్రిక్యులేషన్ పరీక్ష ఇవ్వవలసినది ఆయేడే. పాపం ఆతనికి ఎటూ తోచలేదు. బనారస్‌లో ఒకపిల్ల వానికి ప్రైవేటు చెప్పటం ప్రారంభించినాడు. బడినుండి పోయి సాయంకాలం ఆరు గంటలదాకా ఆ పిల్లవానికి చదువు చెప్పేవాడు. అటు తరువాత లమహీకి బయలుదేరి రాత్రి ఎనిమిది గంటలకు ఇల్లుచేరుకొనేవాడు. ఈ పరిస్థితులలో ఆతడు మెట్రిక్ పరీక్ష రెండవ శ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు. క్వీన్స్ కాలేజి నిబంధనల ప్రకారం ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైన విద్యార్థులకే బడిఫీసు చెల్లించనవసరం లేక పోయేది. అందుకోసం ప్రేంచంద్ సెంట్రల్ హిందూ కాలేజిలో ప్రవేశించటానికి దరఖాస్తు పెట్టుకొన్నాడు. అక్కడ గణితశాస్త్రం ఆతని ప్రవేశార్హతకు భంగకారణం ఐనది.

అదృష్టవశాత్తు ఆతనికి ఒక అడ్వొకేటుగారి అబ్బాయికి చదువు చెప్పే ఉపాధి లభించినది. "జీతం ఐదు రూపాయలు. రెండు రూపాయలు కర్చు పెట్టుకొని మూడు రూపాయలు ఇంటికి పంపటానికి నిర్ణయించినాను. అడ్వొకేటు గారి అశ్వశాలపైన ఒక చిన్న మట్టి గది ఉండేది. అందులో ఉండటానికి అనుమతి పొందినాను. దానిలో ఒక గోనె తట్టు పరుచుకొన్నాను, చిన్న కందీల కొనుక్కొని పట్టణవాసం ప్రారంభించినాను. ఇంటినుండి కొన్ని కుండలు మూకుళ్ళు తెచ్చుకొన్నాను. ప్రొద్దున్నే కొద్దిగా కిచ్డీ వండుకొని వంటపోళ్ళు కడుక్కొని గ్రంధాలయానికి పోయేవాణ్ణి గణితశాస్త్రం సాకుగా నవలలు చదివేవాణ్ణి.

ఇట్టి జీవితం గడుపుతూ ప్రేంచంద్ అప్పులు చేసినాడు ఒక పుస్తక విక్రేతకు ఒక్క రూపాయికే తన రచనలలో ఒకటి అమ్ముకొన్నాడు. ఈ సమయంలోనే చూనార్‌లోని మిషనరీ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ప్రేంచంద్‌కు తటస్థపడ్డాడు. తన పాఠశాలలో ఒక ఉపాధ్యాయుడు కావలసి ఉండగా ఆయన ప్రేంచంద్‌ను నెలకు పద్దెనిమిది రూపాయల జీతంమీద కుదుర్చుకొన్నాడు. అది 1899 వ సంవత్సరం.

ఈ విధంగా ప్రేంచంద్ దీర్ఘమైన ఉపాధ్యాయ జీవితం ప్రారంభమైనది. ఈ బడిలో ప్రేంచంద్ చాలా కాలం ఉండలేదు. 1900 సంవత్సరంలో ప్రభుత్వ

జిల్లా పాఠశాల, బహ్రైచ్‌లో ఆతనికి సహాయోపాధ్యాయుడుగా ఉద్యోగం లభించినది. ఆ కాలములో నెలకు ఇరువై రూపాయలంటే రాజభరణం వంటి ప్రభుత్వోద్యోగం అది. రెండు మూడు మాసాలకే ప్రేంచంద్‌కు ప్రతాప్‌గఢ్‌కు మార్పిడి జరిగినది. ఇక్కడనుండి అల్లాహాబాదుకు ఉపాధ్యాయశిక్షణకై వెళ్ళినాడు. శిక్షణ తరువాత అల్లాహాబాదు మాడల్ స్కూలులో ప్రధానోపాధ్యాయుడుగా నియుక్తుడైనాడు. అక్కడినుండి కొలది కాలానికే కాన్పూర్ ప్రభుత్వ పాఠశాలకు మార్పిడి జరిగింది. సాహిత్య రంగంలో కూడ ఈ సమయంలోనే ప్రేంచంద్ తన అభ్యాసం ప్రారంభించినాడు. కాన్పూర్‌లో ఉన్నకాలంలో ఆతనికి 'జమానా' పత్రికసంపాదకుడు మున్షీ దయానారాయణ్‌నిగమ్‌తో జీవితాంతసాహచర్యము, సాన్నిహిత్యము ఏర్పడినవి.

ప్రేంచద్ మొదటినవల 'అస్రారె-మాబిద్' (గుడిరహస్యం) బనారస్‌నుండి వెలువడే ఉర్దూ వార పత్రిక 'ఆవాజె-ఖల్క్' లో 1903 అక్టోబరు నుండి 1905 ఫిబ్రవరి వరకు ధారావాహికంగా వచ్చింది. పూజారులు మహంతులు చేసే దుర్మార్గాలను ఈ నవల కొంచెం అతిగా వర్ణిస్తది. యశోదానంద్ అవినీతి పరుడూ స్వేచ్ఛాచారి ఐన పండా, కులటల సహవాసం చేస్తూ గుడికి పూజార్థమై వచ్చే అమాయిక స్త్రీల సౌశీల్యాన్ని చెరుస్తాడు. యశోదానంద్ అనే పండా, బీబీజాన్ అనే కులట, పండా మూలంగా నీతి బాహ్యురాలైన రాంకలీ అనే యువతి ఇందులోని ప్రధాన పాత్రలు.

ఈ నవల అల్లికలో బిగువు తక్కువ. ఆలంకారికమైన తీరుతీరు వర్ణనలకు ప్రాధాన్యం ఎక్కువ. వాస్తవికత్వంకంటె అతివాస్తవికత్వానికి ఇది దగ్గరగా ఉంటది. జీవితంలోని ఒక అంశాన్ని మాత్రమే అతిశయంగా వర్ణిస్తూ అతివక్రంగా చిత్రిస్తది. వాస్తవికత్వం ఇంతకంటె చప్పగా ఉంటది. ఇది ఉదాహరణప్రాయమైన జీవితచిత్రణం కాదు. జీవితాన్ని చిత్రించవలెననే ఉద్దేశంకంటె ఏదో ఉల్లాసపూర్వకంగా అపహాస్య ప్రాధాన్యంగా వర్ణించటమే ఈ నవల ఉద్దేశంగా కనుపడుతది. ఇందులోని పాత్రలుకూడ మంచి చెడుగుల మూర్తీకరణాలు. ఇందులో రాంకలీ భర్త ఒక్కడే మర్యాదగల మనిషి. అందరూ ఆతణ్ణి మోసం చేస్తారు; పిచ్చివాణ్ణి చేసి ఆడిస్తారు. రాంకలీ తియ్యని మాటలకు లోబడ నిరాకరించే సౌశీల్యం గల మంచి పిల్ల దులారీని అంతంతమాత్రమే చిత్రించటం జరిగింది.

రచయిత ఈ మార్గంలో చేసిన ప్రథమ ప్రయత్నం కనుక ఇది అపరిపక్వ రచన అని చెప్పాలె. ఇందులో యౌవనపు పొంగు ఎక్కువ. జీవితాన్ని తెలుపు

గానో లేదా నలుపుగానో చూచే జాడే కాని ఈ రెంటి మేళనమైన మసకవర్ణంగా దర్శించే జాడ లేదు.

ప్రేంచంద్ రెండో నవల "హం ఖుర్మా-ఒ-హం సవాబ్" 'ప్రేమ' అనే హిందీ రూపంతో 1907 లో ఇండియన్ ప్రెస్, అల్హాబాదునుండి వెలువడినది. దాని వెల పది పీసాలు. ఈ నవలకు రెండో పేరు 'దో సఖియోంకా వివాద్' నవలమీద రచయిత అసలుపేరు బాబు నవాబ్‌రాయ్ బనారసీ అని ఉన్నది. రచయిత భావనాశక్తి మొదటి నవలలోకంటె ఇందులో ఎక్కువ పరిపక్వమైనది. ఈ నవలలో కథానాయకుడు అమృతరాయ్ తనకు నిశ్చితార్థం జరిగిన అందగత్తె ధనికురాలు ఐన ప్రేమను కాదని పూర్ణ అనే విగతభర్తృకయువతిని పెండ్లి చేసుకొంటాడు. సాంఘికప్రతిపక్షశక్తులకు ధైర్యంగా ఎదురొడ్డి గెలుస్తాడు. ఈ విధంగా ఈ నవల సనాతనాచారం ముసుగులో ఉన్న సాంఘికమైన దుష్టాచారాలపై యుద్ధం ప్రకటిస్తది. ఇది సాంఘిక దురాచారాలపై ప్రేంచంద్ సాగించిన సాహిత్య సమరం.

ఇందులో ప్రేంచంద్ భావి ఔన్నత్యాన్ని సూచించే చిహ్నాలున్నా కొంత కుఱ్ఱతనం కనుపడుతది. పరిపక్వదశలో సాధ్యమయ్యే సంయమనంకూడ ఇందులో లేదు. ఇందులోని పాత్రలు ఇంకనూ సాధారణమైనవే; మంచి చెడుగుల సంగ్రహ రూపాలే కాని గొప్పతనమూ దౌర్బల్యాల సమ్మిశ్రితమైన సంశ్లిష్ట మానవ రూపాలు కావు.

ఇంకొక తొలి నవల 'కిష్ణ' 1907 లో ప్రకటితమై అదే సంవత్సరం జమానాలో సమీక్షింపబడినది. ఇది 142 పుటల గ్రంథం. కాని ఈనాడు ఒక్క ప్రతి కూడా లభించటంలేదు. స్త్రీలకు సొమ్ములమీద ఉండే ఆసక్తిని ఇది వ్యంగ్యంగా విమర్శిస్తది. రాబోయే 'గబన్' నవలను ఇది సూచించినట్లు కనిపిస్తది.

కాన్పూర్ 'జమానా' పత్రిక కార్యాలయంలో కేంద్రీకృతమైన సాహిత్య వాతావరణం ప్రేంచంద్‌కు చాలా ఆనందం కలిగించింది. మున్షీ దయానారాయణ్ నిగమ్ తోడి ప్రగాఢస్నేహం శీఘ్రంగా వర్ధిల్లింది. వేసవి సెలవులలో ప్రేంచంద్ లమహీకి వెళ్ళినప్పుడు అక్కడ కాన్పూర్ సాహిత్యవాతావరణం లేమి ఆతనికి బాధాకరమైన కొరతగా తోచినది. నిగమ్‌కు వ్రాసిన ఒక జాబులో ప్రేంచంద్ లమహీ వేసవి నివాసం అగ్నిపరీక్షగా వర్ణిస్తూ తానక్కడ సాహిత్యకృషి ఏమీ చేయలేక పోయినానని వ్రాస్తాడు.

"ఎండ భయంకరంగా ఉన్నది. అనుకోవటానికి నాకూ ఇక్కడొక ఇల్లున్నది. నిజంగా ఈ ఊరివారంతా అసూయ పడేటంత యిల్లే ఇది. గాని సుఖంగా

ఉండటానికి ఇందులో ఒక అఱ్ఱ కూడ లేదు. మొదటి అంతస్థులో నిప్పులు కురుస్తవి. పైకెక్కిన తక్షణమే నాకు ఆపాదమస్తకమూ చెమటలు పోస్తవి. క్రింది అఱ్ఱలన్నీ చెత్తా చెదరంతో నిండి పోయినవి; చికాకు కలిగిస్తవి. ఒక అఱ్ఱలో ఎడ్లు, మరొక అఱ్ఱలో పిడుకలు. ఒక చోట ధాన్యపు రాశి, మరొక చోట విసుఱ్ఱాయి, రోలురోకండ్లు, కూర్చోవటానికి పడుకొనటానికి మాత్రం స్థలం లేదు. ఎంతో కటకటపడి ధాన్యపుకొట్టులో నా పడకకోసం కొంచెం స్థలం కల్పించు కొన్నాను రాత్రి-బవళ్ళు ఆ పడకమీదనే పడి ఉంటాను, నేను ఒక్కణ్ణి వాహ్యాళికి కూడ పోలేను. కొద్దిరోజులపాటు పిల్లలు కూడ ఇక్కడనే ఉన్నారు. నా భార్యతో వాళ్ళు బస్తీకి పోయినారు. అక్కడినుండి మళ్ళా నా దగ్గరికి వస్తారు. ఈ స్థితిలో చదువుకోవటం, వ్రాయటం అసంభవం. ఉదయాన ఒక గంట ఏదో పుస్తకం తీసి కొన్ని పుటలు తిరుగవేస్తాను. తక్కిన సమయమంతా పడకమీదనే పడి ఉంటాను. సాధారణంగా ఎక్కువసేపు పడుకొనే ఉంటాను కాని ఈ ఊరిలో నిద్రకూడ నా మాట వినేటట్టులేదు. ఇంకా లెక్కలేనన్ని చిక్కులు కష్టాలు కూడ ఉన్నవి. కాన్పూర్‌లో జీవితం నవ్వులతో ఉల్లాసంగా గడిచేది. ఇక్కడ నేను మాటముచ్చట లేని మూగవాణ్ణి. ఈ పరిస్థితులలో బ్రతుకు దుర్భరంగా ఉన్నది. ఈ సెలవులు తొందరగా ముగిస్తే బాగుండును, మళ్ళా స్నేహపూర్వక సమావేశాలలో హాయిగా వినోదించవచ్చు. ఇక్కడికి వచ్చి ఇరువైదినాలకు పైగా గడచినా నేను ఒక్కమూరైనా నాకు ప్రియమైన మాట "బంబూక్" అనలేదు".

ప్రేంచంద్ మొదటి వివాహం సంపూర్ణంగా విఫలమైనది. ఈ వేసవిలోనే ఆయన భార్య ఉరిపెట్టుకొని చనిపోవటానికి ప్రయత్నించింది. ఈ విషయంకూడ ప్రేంచంద్ నిగమ్‌కు వ్రాసిన ఒక జాబులో ఉన్నది.

"అన్నా! నా దుఃఖం ఎవరికి చెప్పుకోను? ఈ దుఃఖం నేనై భరించలేను. ఎంతో కష్టంగా ఒక పదిహేనుదినాలు గడిపినానో లేదో గృహకల్లోలాలు పరంపరగా మొదలైనవి. ఆడవాళ్ళిద్దరూ ఒకరినొకరు తిట్టుకొనేవారు. కోపంతో నా భార్య ఉరిపెట్టుకోవటానికి ప్రయత్నించింది. అర్ధరాత్రి మా సవతితల్లికి ఏదో అనుమానంవేసి ఆమెను ఉరితాడునుండి తప్పించింది. ఇదంతా నాకు ప్రొద్దున తెలిసింది. నాకు కోపం వచ్చి ఆమెను బాగా తిట్టినాను. ఆమె తనను పుట్టింటికి పంపవలసిందిగా కోరింది. ఇక్కడ ఒక్కక్షణం ఉండనని పట్టు పట్టింది. నా దగ్గర పైకం లేదు. భూములనుండి ఎంతో కొంత సంపాదించి ఆమె ప్రయాణానికి

ఏర్పాట్లు చేసినాను. ఏడ్చి మొత్తుకొని ఆమె వెళ్లిపోయింది. ఆమెవెంట నేను పోలేదు. ఆమె పోయి ఎనిమిది దినాలైనా, ఒక్క జాబుకూడ రాలేదు. ఏ వార్తలు తెలియరాలేదు, ఆమెసంగతి నాకేమీ బాగనిపించలేదు. ఆమెను చూడ వలెననే కోరిక కూడ నాకు కలుగటంలేదు. ఈ విడిబాటే చివరిది కావచ్చు. అట్లే కానీ. భార్య లేకుండానే ఉండి పోతాను ...''

ప్రేంచంద్ మొదటి వివాహం గూర్చిన సమాచారం అత్యంతస్వల్పంగా తెలుస్తున్నది. ప్రేంచంద్ ఆవిషయమై ఏమీ చెప్పలేదు. ఇతరులకు కూడా ఏమీ తెలియదు. ఆ సమాచారం యావత్తు నిగూఢంగా దాగిపోయింది. ఆయన మొదటి భార్య అందగత్తె కాదు. జగడాలమారిది. ఆమెతో నెగలటం కష్టం. కాని భారత దేశంలో వివాహబంధం వీగిపోవటానికి ఇదొక పెద్ద కారణం కాదు. ప్రేంచంద్ ఓరిమి కలవాడు; దీర్ఘకష్టాలనుభవించినవాడు. రెండవ పెండ్లి తరువాతకూడ ఆతడు ఆవిధంగనే ఉండేవాడని అన్నివిధాల తెలుస్తున్నది. అదృష్టంకొద్దీ ద్వితీయ వివాహం అతనికి సంతోషప్రదమైనది. మొదటి భార్య చివరకు ఏమైనదో కచ్చితంగా తెలువదు. ప్రేంచంద్ ద్వితీయవివాహానంతరం కూడ ఆమె కొన్నాళ్లు బ్రతికి ఉన్నట్లూ ఆమెను మళ్లా తీసుకరావటానికి అప్పుడప్పుడు యోచనలు జరిగినట్లు మాత్రం తెలుస్తున్నది. శివరాణి తానే స్వయంగా మొదటి భార్యను ఇంటికి తీసుకరమ్మని ప్రేంచంద్‌ను కోరినా ఆతడందుకు ఒప్పుకోనట్లు వివరించింది.

## IV

ప్రేంచంద్ తెల్లగా, పొడుగ్గా, అందంగా ఉండేవాడు. అతనికి గోధుమ వర్ణంగల పెద్ద మీసాలుండేవి. అన్ని ప్రధానవిషయాలలో చాలా సామాన్యుడుగా ఆడంబరాలు లేనివాడుగా ఉన్నా, తలపాగా చుట్టుకొన్నప్పుడు రాకుమారుడుగా కని పించేవాడు. ఆతణ్ణి మొదటిసారి కలుసుకొన్నప్పుడు, అతడే ప్రేంచంద్ అని తెలిసి ప్రజలకు చాలా ఆశ్చర్యం కలిగింది అతని యింటికి పోయి ఆతణ్ణి ప్రేంచంద్ ఎక్కడుంటాడని ప్రజలు అడిగేవారు వాళ్ళు ఒక అద్భుతమైన గంభీరవ్యక్తిని చూస్తామనుకొనేవారే కాని పూతమెరుగులు లేని సాధారణమైన పల్లెటూరివాణ్ణికాదు. గొప్ప రచయిత అంటే టాగోర్‌వలె ఉంటాడని వాళ్ళ భావన. అటువంటి వాళ్ళంద రికి ప్రేంచంద్‌ను మొదటిసారి కలుసుకొన్నప్పుడు ఆశాభంగం కలిగేది. కాని క్రమంగా ఆతని స్వభావసిద్ధమైన మంచితనమూ, గొప్పతనమూ, అతి సాధారణ

జీవితవిధానమూ, జీవితంపట్ల గంభీరదృక్పథమూ, నవ్వే శక్తీ గమనించి ఆయన యెడ ఆసక్తులయ్యేవారు. గొప్పతనంతో జతగా ఉంటాయని వాళ్ళ మనస్సులలో అనుకొన్న ఆడంబరమూ, గాంభీర్యమూ ఆతనిలో లేకుండేవి. ఆతడు అచ్చమైన పల్లెటూరి మనిషి; శారీరకంగా మానసికంగా రైతుబిడ్డ స్వరూపస్వభావాలు కల వాడు.

ఆయనను ఎరిగిన ప్రతివాడు ఆయనను ప్రేమించేవాడు. సనాతనులు ఆచారపరాయణులు ఆతణ్ణి ఏవగించుకొనేవారు. మతపక్షపాత స్వభావంగాని దృష్టి గాని ఆతనికి లేదు. ఆలోచనలో ఆయన చాలా ప్రగతిశీలి. ఆతడు తన రచనలలో మొగమోటం లేకుండా మూర్ఖతత్వాన్ని ఖండించినాడు. ఆతనికి సంతోషం కలిగి నప్పుడు పెద్దగొంతుకతో, నోరార తడలు తడలుగా నవ్వేవాడు. ఆ గుణమే ఆతని యిద్దరు కొడుకులకూ వారసత్వంగా సంక్రమించింది.

ప్రేంచంద్ మొదటిభార్య రూపంలోకాని మేధాసంపదలోకాని ఆతనికి తగి నది కాదు. వారి బంధం భగ్నమైపోయింది. ఆమెది విషాదజీవితమైపోయింది. జీవితమంతా శాపంగా పరిణమించినది. వివాహావ్యవస్థను ఒక జూదంగా చేసే భారతీయవివాహవిధానానిదే ఈదోషం అనాలె. యువతీయువకుల సంతోషకంటె తమ లాభాలే చూచుకొనే నీచులైన మధ్యవర్తులు ఎక్కువగా వైవాహిక సంబంధాలు ఏర్పాటు చేస్తుంటారు. శరత్‌చంద్రుని ఒక నవలలో కాటికి కాళ్లుచాచిన ఒకవృద్ధ బ్రాహ్మణుడు చిన్నకన్యలను పెండ్లి చేసుకొంటాడు. ఆ కన్యల తలిదండ్రులకు స్వర్గప్రాప్తికోసమే ఈ ఘోరం జరుగుతది ఆతడు ఏడాదికి ఒకసారి భార్యల యిండ్లకు పోయి విలువైన కట్నాలు కానుకలు మోసుకొని వస్తాడు. కొన్నాళ్ళకు ఈ ప్రయాణాలుకూడా చేయజాలని ముదివగ్గె పోతాడు. అప్పుడా దురాశాపరుడు తన చెప్పుచేతలలో ఉన్నవాణ్ణి తనకు ప్రతినిధిగా బహుమతులు కట్నాలు తీసుకరావ టానికి పంపిస్తాడు. సనాతనాచారంగల ఈ పవిత్రదేశంలోనే ఇటువంటి ఆశ్చర్య కరమైన నీచవృత్తి వర్ధిల్లగలిగినది.

ప్రేంచంద్ ఈసారి ఒక వితంతువును పెండ్లిచేసుకోవటానికి నిశ్చయించు కొన్నాడు. ఇది ఆతని గొప్పతనానికి ఉన్నతాదర్శాలకు పొసగినట్లుగా ఉన్నది. శివ రాణీదేవి బాలవితంతువు. ఆమెతండ్రి గొప్పధైర్యంగల భూస్వామి; ఫతేపూర్ సమీపంలో ఉండేవాడు. ఆమెకు పునర్వివాహం చేయాలెనని ఆతని ఆతురత. ఇటు వంటి అభిప్రాయం 1906లో ఎంతో ధైర్యం ఉంటేనే కలుగుతది అప్పుడే ప్రేంచంద్ ద్వితీయవివాహం జరిగింది.

శివరాణీదేవి వ్రాసిన "ప్రేంచంద్-ఘర్ మేఁ" (ఇంట్లో-ప్రేంచంద్) అనే పుస్తకంవలన ప్రేంచంద్ గృహజీవితచిత్రం స్పష్టంగా తెలుస్తది. తండ్రివలెనే ప్రేంచంద్ కూడా అతిసారవ్యాధికి గురియై ఎప్పుడూ ఉదరరోగాలతో బాధపడు తుండేవాడు. ఆయన మానవస్వభావంలో విశ్వాసంగల స్వచ్ఛమైన ఆదర్శవాది. ఆయన అందరినీ నమ్మేవాడు. నమ్మినవాళ్ళందరూ ఆతణ్ణి మోసగించినారు. చిన్నచిన్న మొత్తాలు చేబదులు ఇచ్చేవాడు. వాళ్లెవ్వరూ తిరిగి ఇవ్వకపోయేవారు శివరాణి కొంచెం మెలకువకలిగినది కనుక శక్తికి మించిన ప్రేంచంద్ ఔదార్యానికి అభ్యంతరం చెప్పేది "ధాపోర్ శంఖ్"లో ఒక కపటసాహిత్యకుడు తనను ఏవిధంగా వంచించినాడో ప్రేంచంద్ వివరించినాడు. తన సవతి తమ్ముడు మెహ్తాబ్ రాయ్‌కు పని కల్పించటానికి ప్రేంచంద్ ఒక ముద్రణాలయం కొనాలెనని అను కొంటుండేవాడు. శివరాణీదేవి ఆముద్రణాలయం తమ పెద్దకుమారుడు శ్రీపత్ పేరుతో కొనుమని సూచించినది. ఇది సోదరులమధ్యన తీవ్రాభిప్రాయభేదాలకు దారితీసింది. ఇంటి విషయాలలో శివరాణిదే పైచేయిగా ఉండినట్లు అన్నివిధాల సమాచారాలను బట్టి తెలుస్తున్నది.

1905 మే నుండి 1909 జూన్‌వరకు ప్రేంచంద్ కాన్పూర్‌లో ఉన్నాడు. ఆ సమయంలో ఆయన రాజకీయవిషయాలలో శ్రద్ధగా పాల్గొంటూ తరుచుగా జమానా పత్రికకు వ్రాసేవాడు. గోఖలేగారికి శిష్యుడుగా ప్రారంభించి తిలక్ అభిప్రాయాలవైపు శీఘ్రంగా మొగ్గిపోయినాడు. దయానారాయణ్ నిగమ్ స్వాభావికంగా మితవాది, కాని ప్రేంచంద్ మాత్రం తీవ్రవాది. ఐనా వాళ్ళ స్నేహం ఒడుదొడుకులు లేకుండా సాగింది. ప్రేంచంద్ అభిప్రాయాలగూర్చి నిగమ్ ఇట్లా అంటాడు

'రాజకీయంగా ప్రేంచంద్ తీవ్రవాదులవైపు మొగ్గుచూపేవాడు. మేమిద్దరం కలిసి అహ్మదాబాదు కాంగ్రెసు సమావేశాలకు పోయి ఒకచోటనే ఉన్నాము. కాని ఆయన తిలక్‌ను బలపరచినాడు; నేను గోఖలే, సర్‌ఫిరోజ్‌షాలను బలపరచినాను. మేము ఎప్పుడూ వాదించుకొనేవాళ్ళం, కాని ఎవరి అభిప్రాయాలకు వాళ్లు కట్టుబడి ఉండేవాళ్ళం. చిన్నచిన్న సంస్కరణలు చాలవని ఆతని అభిప్రాయం. మింటోమార్లే, మాంటేగ్‌ఛెమ్స్‌ఫోర్డ్ ప్రణాళికలు ఆతనికి నమ్మకం కలిగించలేకపోయినవి.'

ప్రేంచంద్ తీరుతెన్నులగూర్చి నిగమ్ ఇట్లా వ్యాఖ్యానిస్తాడు 'అసమ యుద్ధంలో సంధిప్రయత్నాల విషయమై ఆతనికి అపనమ్మకం. తీవ్రమైన పోరాటం

సాగించనిదే ఏమీ సాధించలేమని ఆతని అభిప్రాయం. వీలైనంత శీఘ్రంగా ప్రజలను ఇందుకు సన్నద్ధం చేయాలెనని ఆతని కోరిక ప్రభుత్వంతో తీవ్రంగా ఘర్షణపడనిదే ఏమీ చేయలేమని ఆతని అభిప్రాయం.'

శివరాణీదేవి వివరించినట్లు ప్రేంచంద్ నిత్యజీవిత పద్ధతి కాన్పూరులో ఇట్లా ఉండేది "ఆయన వేకువజామున నాల్గు గంటలకు మేల్కొని చుట్ట కాల్చి కాల్యాలు తీర్చుకొని స్నానంచేసి సమయానికి ఏది ఉంటే అది ఉపాహారంగా తీసుకొనేవారు. అటుతరువాత నిశ్చలంగా ఏదో వ్రాస్తూ కూర్చుండేవారు. ఆయన కలం కార్మికుని చేతి సారవలె మహా వేగంగా సాగిపోయేది. సాయంకాలం నిగమ్ ప్రభృతి స్నేహితులతో గోష్ఠి సాగేది. రాత్రి ఆలస్యంగా ఇంటికి తిరిగి వచ్చేవారు."

ప్రేంచంద్ రచించిన మొదటి కథానిక "దున్యాకా సబ్‌సే అన్మోల్ రతన్" (ప్రపంచంలో అమూల్యతమమైన రత్నం) 1907 లో వెలువడినది అది పాతకాలపు కథల కట్టుబడిలో, 'అరేబియన్ నైట్స్' లోని కధవలె నడిచింది. కాని దాని యితివృత్తం మాత్రం నైతికమైనది. ప్రేంచంద్ తొలి కథానికలు రూపంలో నైతికమైనవైనా సాంఘికేతివృత్తం పుష్కలంగా కలవి. ఈసోపు కధలు, హితోపదేశం, పంచతంత్రం కథలతో ఆ కధలకు పై పై పోలిక కనుపడుతది.

ప్రేంచంద్ తన మొదటి కధానికలో ప్రపంచంలో అన్నిటికంటె విలువైనదేది అనే ప్రశ్నవేస్తాడు. ఉరితీయబడ్డ కొడుకును కన్న తండ్రి కన్నీళ్లు కావు. భర్త చితిపై ఆహూతి ఐపోయిన పతివ్రత చితాభస్మం కాదు కాని "దేశ స్వాతంత్ర్యం కోసం ఒలికించిన చివరి నెత్తురు బొట్టే విలువైనది."

ప్రేంచంద్ మొదటి కథానికల సంపుటి "సోజె వతన్" అనేదానిని 1908 ఆగస్టు జమానా పత్రికలో ప్రకటన చేసినారు ఈ సంపుటిలో ఐదు దేశభక్తి కధలున్నవి. కాన్పూరులో గడపిన ఈ కాలంలో ప్రేంచంద్ రాజకీయవిషయాల గూర్చి కూడా బహుళంగా వ్రాసేవాడు. మజ్జినీ జీవితంగూర్చి ఒక చిన్న వ్యాసం, గారిబాల్డీ జీవితచిత్రం, వివేకానందులపై స్తుతిపూర్వకమైన వ్యాసం ఆయన వ్రాసినాడు.

1909 జూన్‌లో ప్రేంచంద్‌ను మహోబాపు పాఠశాలల సహాయ పర్యవేక్షణాధికారిగా మార్చినారు. అప్పుడాయన జీతం నెలకు యాభై రూపాయలు. 'సోజెవతన్' సంపుటిలోని కధలమూలంగా ప్రేంచంద్‌మీద ప్రభుత్వం కన్నెఱ్ఱ చేసింది. నవాబ్‌రాయ్ అనేది ప్రభుత్వోద్యోగి ఐన ధన్‌పత్‌రాయ్ కలంపేరని

కనుగొన్నారు. ప్రేంచంద్ మీద జిల్లా మున్సబు కోర్టులో నిప్పులు చెరగినారు. జిల్లా న్యాయాధికారి 'సోజెవతన్' సంపుటం ప్రతులన్నీ స్వాధీనం చేసుకోవటానికి ఆజ్ఞాపించినాడు. అధికారుల అనుజ్ఞ లేనిదే ప్రేంచంద్ ఏమీ వ్రాయకూడదని ఆజ్ఞాపించినారు. నవాబ్‌రాయ్ అనే మారుపేరువలన ఇక లాభం లేదు. ఈ పరిస్థితుల లోనే రచయిత భారతీయ సాహిత్య జిజ్ఞాసువు లందరికీ ఈనాడు సుపరిచితమైన ప్రేంచంద్ అనే కలంపేరు పెట్టుకొన్నాడు. నిగమ్ సూచించిన ఈ పేరును రచయిత మహా సంతోషంతోస్వీకరించినాడు.

ప్రేంచంద్ తనకు జిల్లా న్యాయాధికారితో జరిగిన ముఖాముఖిని ఈవిధంగా వర్ణించినాడు

"ఒక రాత్రి నేను నా గుడారంలో కూర్చొని ఉండగా జిల్లా న్యాయాధికారి దగ్గరినుండి తక్షణమే వారిని చూడవలసిందిగా ఆదేశిస్తూ ఒక జాబు వచ్చింది. అది చలికాలం. అధికారి పర్యటనలో ఉన్నాడు. ఎడ్లబండిలో రాత్రంతా ప్రయాణం చేసి దాదాపు ముప్పై నలుభై మైళ్లు గడచి మరునాడు ఆయనను కలుసుకొన్నాను. ఆయనగారి యెదుట "సోజె వతన్" ప్రతి పడి ఉన్నది. అది చూచి నాకు బాధ కలిగింది. అప్పుడు నేను నవాబ్‌రాయ్ అనే కలంపేరుతో వ్రాసేవాణ్ణి. రహస్య సమాచార శాఖవాళ్లు ఆ పుస్తక రచయితకోసం గాలిస్తున్నట్లు నాకు తెలియవచ్చింది. వాళ్లు నన్ను కనుక్కొన్నట్లూ అందుకే నా సమాధానంకోసం పిలిపించినట్లూ అవగతమైనది. న్యాయాధికారి అడిగినాడు :

"ఈ పుస్తకం నీవు వ్రాసినావా ?"

నే నది ఒప్పుకొన్నాను.

ఆ కథల సారాంశం అడిగి ఒక్కటొక్కటిగా విన్నాడు. చిట్టచివరకు కోపంతో ఇట్లా భగ్గుమన్నాడు. "నీ కథలన్నీ రాజద్రోహ పూరితాలు. బ్రిటిష్ పరిపాలనలో ఉన్నందుకు నీ అదృష్టాన్ని నీవు అభినందించుకోవాలె ఇదే మొగలాయి ప్రభుత్వమైనట్లైతే నీ రెండు చేతులు నరికేవాళ్లు. నీ కథలు పక్షపాతంతో వ్రాసినవి. బ్రిటిష్ అధికారాన్ని ధిక్కరించిన నేరం చేసినావు ......"

ప్రేంచంద్ కాన్పూర్ విడిచి మహోబాకు తరలిపోతున్నప్పుడు అలహాబాదు, ఇండియన్ ప్రెస్ యజమాని చింతామణి ఘోష్ తన ప్రెస్‌నుండి ప్రచురించదలచిన ఒక ఉర్దూ పత్రికకు సంపాదకుడుగా ఉండవలసిందని కోరినాడు. ప్రేంచంద్

ఘోష్‌ను కలుసుకొన్నాడు. ఆ పత్రికకు ఏమి పేరు పెట్టాలెననే చర్చ జరిగింది. ప్రేంచంద్ దానికి 'ఫిర్‌దౌస్' పేరు సూచించినాడు. కాని తాను చేసే ప్రభుత్వోద్యోగం విడిచిపెట్టటానికి వెనుక ముందాడినాడు చివరకు ఆ పత్రిక 'అదీబ్' అనే పేరుతో ప్యారేలాల్ షాకిర్ సంపాదకత్వాన వెలువడింది. ప్రభుత్వోద్యోగంలోని తీరుతీరు లోటుపాట్లతో ప్రేంచంద్ నిరంతరం బాధలు పడుతుండినా, పదేపదే ఆ ఉద్యోగం మానుకోవాలెనని అనుకొన్నా చివరి నిమిషంలో అది విడిచిపెట్టటానికి వెనుకముం దాడేవాడు. 'జమానా' పత్రిక విషయంలో గూడ ఈ విధంగానే జరిగింది. కాన్పూరులో ఉంటూ 'జమానా' పత్రికలో పనిచేయటానికి ప్రేంచంద్ ఆర్థికమైన కొన్ని ప్రాథమిక అభయాలు కోరినాడు. కాని చివరి నిమిషంలో సంకోచించి మానుకొన్నాడు. అదేవిధంగా మార్వాడీ పాఠశాలలో సహాయోపాధ్యాయ పదవిని అంగీకరించటానికి తిరస్కరించినాడు. ప్రధానోపాధ్యాయ పదవికంటె తక్కువ తానేదీ స్వీకరించనని నిగమ్‌కు వ్రాసినాడు.

## V

ప్రేంచంద్ బోర్లపడుకొని కాళ్లు గాలిలో ఆడిస్తూ తన గ్రంథాలు వ్రాసేవాడు. అతడు పనిచేసే తీరును ప్యారేలాల్‌షాకిర్ ఇట్లా వర్ణించినాడు.

'ఒకనాడు నాకు మున్షీ ప్రేంచంద్ ఇంటిమీదుగా వెళ్లవలసి వచ్చింది. అట్లా పోతున్నాను కనుక ఆయనను చూడలె ననుకున్నాను. లోపలికి పోయేసరికి ఆయన మహా శీవిగా ఒక బల్లమీద పడుకొని ఉన్నాడు. అతడు బోర్ల పడుకొన్నాడు. రెండు కాళ్లు మోకాళ్లనుండి గాలిలో తేలి ఆడుతున్నవి అతని కెదురుగా ఒక హిందీ పుస్తకం తెరచుకొని ఉన్నది. ఆయన కలం శరవేగంగా నడుస్తున్నది. కలంతోపాటు అదే వేగంతో అతని కాళ్లు కూడా కదలుతున్నవి. ఆయన ఏదో పుస్తకంమీద విమర్శ వ్రాస్తున్నాడనుకొన్నాను. లోపలికి ప్రవేశిస్తూ "ఎవరిని విమర్శిస్తున్నారని" అడిగినాను. "నే నెవ్వరినీ విమర్శించటం లేదు. "రూఠీరాణీ"ని (కుపితరాణి) సాంత్వన పరచటానికి యత్నిస్తున్నా" నని నవ్వుతూ సమాధానం చెప్పినాడు.'

అతడు "రూఠీరాణి" (కుపితరాణి) అనే హిందీ నవలికను ఉర్దూలోనికి అనువదిస్తూ ఉండెను. అది రాజపుత్ర శౌర్యానికి, వాళ్ల కుట్రలకు, వక్రబుద్ధులకు, ఒక ధైర్యవంతురాలైన రాణికి బుద్ధిహీనుడూ స్వేచ్ఛాచారీ ఐన రాజుకు, రాజపుత్రుల చీలికలు పతనాలకు, స్త్రీ ధైర్యానికి సంబంధించిన కథ.

"బడే ఘర్కీ బేటీ" (గొప్ప యింటి ఆడుబిడ్డ) ప్రేంచంద్ కలంపేరుతో ప్రచురితమైన మొదటి కథ. ఆతడు మొదటి దశలో ఆశ్చర్యకరమూ అద్భుతమూ ఐన విషయాల గూర్చి వ్రాసేవాడు. తరువాత సాంఘికేతివృత్తాలవైపు తిరిగినాడు. ఆతని రచనలో పరిపక్వత అప్రయత్నంగా పెల్లుబికింది. మహోబాలో ఉండినప్పుడు 'రాణీ సారంధా' 'రాజా హర్‌దౌల్' మొదలైన బుందేలీల (బొందెలివారి) శౌర్య సాహసాలకు సంబంధించిన కథలు వ్రాసినాడు. బుందేల్ ఖండపు సౌందర్యం, అక్కడి వృక్షాకీర్ణపర్వతాలు, లోయలు, సెలయేరులు, చెలమలు ఆయన చాలా ఆసక్తితో వర్ణించినాడు.

ప్రేంచంద్ 1912 లో "జల్వ్యెఇసార్" అనే క్రొత్త నవల ప్రచురించి నాడు. దీనిని ఇండియన్ ప్రెస్ వారు నవాబ్‌రాయ్ పేరుతో ప్రచురించినారు. ఆటు తరువాత అది "వరదాన్" పేరుతో హిందీలో వెలువడింది. హిమసొద్దీన్ గోరీ "ప్రతాప్‌చంద్" అని పేర్కొన్న నవల బహుశః అదే కావచ్చు. ఎందుకంటే దాని నాయకుడు ప్రతాప్‌చంద్ అనేవాడు. ఈ నవలలో చెప్పుకోతగిన పరిపక్వతా లక్షణాలున్నవి. గొప్ప ప్రజోద్యమాలకోసం ప్రథమ ప్రయత్నం ఇందులో గోచ రిస్తది. అసంతృప్తి అనే విత్తు మహావృక్షంగా పెరుగుతది. ప్రపంచంలోని గొప్ప శక్తులు ప్రజాకోపానికి గురియై మోకరిల్లవలసివస్తది. ఇటువంటి విప్లే తరువాత వచ్చిన 'రంగభూమి' 'కర్మభూమి' నవలల్లో భగ్గుమంటది. ఇందులో ప్రేంచంద్‌కు స్వభావతః ఉండే హాస్యోల్లాసాలు కూడ కనుపడుతవి. దీనిలో ఒక భర్త తన భార్య గదిలో దొంగతనం చేయటానికి ప్రయత్నించి దెబ్బలు తింటాడు. తరువాత అతడొక తోటమాలి కూతురుతో ప్రేమకలాపం సాగించటానికి యత్ని స్తాడు. టిక్కెటు కొనకుండా రైలుబండి ఎక్కుతాడు టిక్కెటు కలెక్టరు పెట్టె లోనికి వచ్చేసరికి నడిచే బండిలోనుంచి క్రిందికి దుముకుతాడు

ఇందులో గ్రామీణ జీవితమూ, హోళికోత్సవమూ, త్రుళ్ళింతలూ వేడుకలూ చక్కగా వర్ణించినాడు. పల్లెటూళ్ళలో ఉన్న దారిద్ర్యమూ బాధలూ దౌర్జన్యమూ చిత్రించినాడు. పాత్రచిత్రణంలో కూడా చెప్పుకోతగిన పరిపక్వత కనుపిస్తది. బిర్జన్, బాలాజీ పాత్రలు - స్వామి వివేకానందుల ప్రతిధ్వనులు - ఇందులో ప్రత్యే కంగా మనసుకు నచ్చేవి.

బిర్జన్ తన భర్త కమలచరణ్‌కు వ్రాసిన ఒక ఉత్తరంలో గ్రామంలోని విషాదపరిస్థితులను ఇట్లా వర్ణిస్తది. "నేను విన్నది ఒక విధంగా ఉన్నది. కాని

పరిస్థితులు అందుకు పూర్తిగా విరుద్ధంగా ఉన్నవి. కూలిపోయిన పూరిగుడిసెలు, మట్టిగోడలు, ఇండ్ల ఎదురుగానే చెత్తకుప్పలు, ఒంటినిండా బురద ఉన్న బఱ్ఱెలు, బక్కచిక్కిన ఆవులు ఇవన్నీ చూస్తుంటే ఎక్కడికైనా వెళ్ళిపోవాలెననిపిస్తది. జనంకూడా దిక్కుమాలిన పరిస్థితులలో ఉన్నారు. వాళ్ళు కేవలం అస్థిపంజరాలు. దురదృష్టమూ, దారిద్ర్యమూ మూర్తీభవించినట్లుగా ఉంటారు. చినిగిపోని బట్టలు వేసుకునేవాడు ఒక్కడూ కనుపడడు. రాత్రింబవళ్ళు చెమటోడ్చి కష్టపడ్డా వాళ్ళకు కడుపునిండ కూడు దొరకకపోవటం ఎంత దురదృష్టకరం! "

తరువాతి కాలాన పరిపక్వంగా వెల్లివిరిసిన ప్రేంచంద్ కళలోని వివిధాంశాలు ఇక్కడనే ఉన్నవి. వాస్తవాన్ని నిర్మొగమోటంగా చిత్రించటం, స్పష్టమూ సజీవమూ ఐన పాత్రలు, దేశపు దిక్కుమాలిన స్థితి, దుఃఖమూ, ప్రజోద్యమశక్తిగా పరిణవిల్లే తిరుగుబాటు రాజుకోవటం, అన్నీ ఇందులో కనుపిస్తవి.

ప్రేంచంద్ జీవిత చరిత్రం సాధికారికంగా వ్రాసిన మదన్‌గోపాల్‌గారి ప్రకారంగా 'శ్యామ' యే తరువాత "వరదాన్" గా రూపొందినది. ప్రతాప్‌చంద్ తల్లి సువామయే బహుశః శ్యామ కావచ్చునని మదన్‌గోపాల్ సూచిస్తాడు. ఆ నవలనే బహుశః 'ప్రతాప్‌చంద్' నవలగా కూడా వర్ణించినారు.

మహోబాలో ప్రేంచంద్ అతిసార దీర్ఘవ్యాధికి గురి ఐనాడు. జీవితాంతం ఆతడు దానితో బాధపడ్డాడు. ఏడాదిన్నర జబ్బుపడ్డ కాలంలో ప్రేంచంద్ ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. ఆయనకు తరాయ్‌లోని బస్తీ జిల్లాకు మార్పిడి జరిగింది. కాని ఆరోగ్యం దృష్ట్యా అదికూడా అంత మంచి ప్రదేశం కాదు. ఔషధసేవనం కోసమూ, ఆరోగ్యం కోలుకోవటానికీ ప్రేంచంద్ కొన్ని మాసాలపాటు సగం జీతంమీద సెలవుతీసుకున్నాడు. ప్రేంచంద్ బస్తీలో ఉండినప్పుడే "ప్రేం-పచ్చీసీ" మొదటి సంపుటం వెలువడింది. అందులో ప్రేంచంద్ వ్రాసిన కొన్ని అత్యుత్తమ కథలు "బడే ఘర్కీ బేటీ", "నమక్ కా దారోగా" (ఉప్పు ఇన్స్పెక్టరు) "రాణీ సారంధా", "రాజా హర్‌దౌల్" మొదలైనవి ఉన్నవి.

బస్తీలో ఉన్నప్పుడే ప్రేంచంద్ హిందీలో వ్రాయటం ప్రారంభించినాడు. ఆ జిల్లాలో తహసీల్దారుగా నియుక్తుడైన మన్నన్ ద్వివేదీ గజపురీతో ఆతనికి స్నేహం కుదిరింది. ఆ స్నేహం ఆయన దృష్టిని హిందీ వైపు మరలించింది. ఉర్దూలో వ్రాయటం అనేది డబ్బు సంపాదన దృష్ట్యా నిరాశాజనకమైన అనుభవమని తెలుసుకున్నాడు.

బస్తీలో ఉన్నప్పుడే ప్రేంచంద్ ఇంటర్‌మేడియటు పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. ఇక్కడున్నప్పుడే మంచి కథానికలు చాలా వ్రాసినాడు. అవన్నీ "ప్రేం పచ్చీసీ" రెండవ భాగంలో అచ్చైనవి. ఆయన ఆర్థికంగా పడిన ఇబ్బందులకు ఒక ఉదాహరణం నిగమ్‌కు వ్రాసిన జాబులో కనుపడుతది. "మొన్నటి జాబులో నాకు రావలసిన ప్రతిఫలంగురించి వ్రాసినాను. మే, జూన్ మాసాలలో మొత్తం ఇరువైనాలుగు కాలములు వ్రాసినాను. జులైలో బహుశః నేనేమీ వ్రాయజాలనేమో! నా జీర్ణశక్తి పూర్తిగా చెడిపోయింది. ఒక గంటసేపుకూడా కూర్చుండే ఓపిక లేదు. ఇదివరకు అంగీకరించిన లెక్క ప్రకారం నాకు ఎనిమిది రూపాయల ప్రతిఫలం రావాలె. మూడు నాలుగు రూపాయలు చేసే ఒక చేతి గడియారం, నాల్గున్నర విలువచేసే ఒక బూట్లజత ఇబ్బందిలేకుండా నాకు పంపగలిగినట్లైతే కృతజ్ఞుణ్ణి. ఆ రెండు వస్తువులూ ఒకే పార్సిల్‌లో పంపండి. నా బూట్లు ఛోటక్ తీసుకున్నాడు. నేను బరిగాళ్ళతోనే తిరుగుతున్నాను ..."

ప్రేంచంద్ పడిన ఆర్థికకష్టాలు ఈ జాబులో ఎంత కటువుగా ఉన్నవో గమనించండి. ఆయన తన ఉద్యోగం విడిచిపెట్టి నిగమ్ నడిపే 'ఆజాద్' వారపత్రికలో పని చేద్దామనుకున్నాడు. నిగమ్ తాను నడిపే "జమానా", "ఆజాద్" పత్రికలలో ప్రేంచంద్ సహాయం కావాలెననుకున్నా అతనికి ఆర్థికమైన పూచీ ఏమీ ఇవ్వలేకపోయినాడు. ఈనాడు ప్రేంచంద్ రచనలన్నీ ఆయన వారసులపాలిటి బంగారు గనులైనవి. కాని ఆయన బ్రతికి ఉన్నప్పుడుమాత్రం చవకబారు బూట్లు కొనుక్కోవటానికీ, మూడునాల్గు రూపాయల విలువచేసే చేతి గడియారం కొనుక్కోవటానికి కూడా ఎంతో కటకట పడ్డాడు.

## VI

ప్రేంచంద్ నార్మల్ స్కూలులో సహోపాధ్యాయుడుగా పనిచేయటానికి 1916 ఆగస్టు 18 నాడు గోరఖ్పూర్ చేరుకున్నాడు. అతడు రెండవ ఉపాధ్యాయుడుగాను హాస్టల్ పర్యవేక్షకుడుగాను పనిచేసేవాడు. ఇక్కడ ఆయన సుఖంగా ఉండినాడు. ఆయన ఆరోగ్యానికి సరిపడినట్లు విశాలమైన ఆవరణం ఉండేది. ఆయన సవతి తల్లి, భార్య ఇద్దరు తీవ్రంగా తగవులాడుకునేవారు. కాని అది ఆయనకు అలవాటైపోయింది. గోరఖ్పూర్‌లో మహావీర్‌ప్రసాద్ పోద్దార్ అనే ఇంకొక స్నేహి

తుడు ప్రేంచంద్‌కు లభించినాడు. దానితో ప్రేంచంద్ హిందీకి మరీ సన్నిహితుడైనాడు. ఆయన షేఖ్‌సాదీ గురించి ఒక చిన్న పుస్తకం హిందీలో వ్రాసినాడు; టాల్‌స్టాయ్ కథానికలు కొన్ని హిందీలోనికి అనువదించినాడు. తన ' ప్రేం పచ్చీసీ '' లోని కొన్ని కథలు హిందీలో ప్రకటించటం మొదలుపెట్టినాడు. 1917 లో ప్రకటించిన '' సప్త సరోజ్ '' ఆయన మొదటి హిందీ కథల సంపుటం. ఇందులోని ఏడు కథలు 1. 'బడే ఘర్కీ బేటీ', 2. 'సౌత్' 3. 'సజ్జన్‌తాకీ దండ్' 4. 'పంచ్ పరమేశ్వర్', 5. 'నమక్ కా దారోగా' 6. 'ఉపదేశ్', 7. 'పరీక్షా', ఆయన సారస్వతవ్యవసాయంలో వెలువడిన అత్యుత్తమ కథానికలలో ఇవి కొన్ని.

ప్రేంచంద్ ఈ కథలలో మానవస్వభావంలో ప్రాథమికంగా ఉన్న మంచిని గురించి నొక్కి చెప్పుతాడు ' బడే ఘర్కీ బేటీ ' (గొప్పయింటి ఆడుబిడ్డ) లో ఆనందికి తన మరదిమీద కోపం. ఆతడొక మోటుమనిషి, వదినను తిడుతాడు, ఆమెమీదికి పావుకోడు విసరుతాడు. కుటుంబం విచ్ఛిన్నమై పోతున్నదనీ, మరది పశ్చాత్తప్తుడైనాడని గ్రహించగానే ఆమె ఆతణ్ణి క్షమించి భర్తనుకూడ శాంతింపజేస్తది.

' నమక్ కా దారోగా ' (ఉప్పు ఇన్స్పెక్టరు) ఏమాత్రం అవినీతికి పాల్పడనివాడు. సత్యమైన నడవడికి ప్రభుత్వంవారు ఆతణ్ణి ఉద్యోగంనుండి తీసివేస్తారు. కాని విశ్వాసపాత్రుడైన ఉద్యోగి తనకు ఉండాలెననుకునే అవినీతిపరుడైన వ్యాపారి ఒకడు ఆతనికి ఉద్యోగం ఇస్తాడు ఈ విధంగా ప్రేంచంద్ జగత్తులో మంచికి ఎప్పుడూ మన్నన ఉంటది. ఇటువంటి అద్భుతాలు వాస్తవిక జీవితంలో జరుగవు. గ్రామ న్యాయాధికారి కూడ వ్యక్తిగత ద్వేషమూ ఇబ్బందులూ మరచిపోయి అంతరాత్మ ప్రేరణతో న్యాయం చేస్తాడు. వివిధ భేదాలు, పక్షపాతాలు, కులతత్వాలు, మూఢ నమ్మకాలు, నిర్హేతుక సిద్ధాంతాలతో భంగమైపోతున్న గ్రామీణ సమాజంలో ఇటువంటి న్యాయం అరుదే.

ప్రేంచంద్ తన సహజమైన ఆదర్శవాదిత్వమూ మంచితనముద్వారా తన పాఠకులను మహోన్నతస్థితికితెచ్చినాడు. ఆతని రచనలు సమాజంలో మంచి కోసం శక్తిని కూర్చినవి. ఆయన మంచిని న్యాయాన్ని వరించినాడు, చెడును అన్యాయాన్ని తిరస్కరించినాడు. ఆతడు జీవితాన్ని వాస్తవికదృష్టితో వర్ణించినాడు. కాని మంచి చెడుగుల మధ్యన ఆంతరికంగా ఉండే ఘర్షను గమనించినాడు. చిట్టచివరకైనా మంచి చెడును జయించితీరుతదనే విశ్వాసం ఆతనికి ఉండేది.

బొంబాయిలోని ప్రసిద్ధ ప్రచురణ సంస్థ హిందీగ్రంధరత్నాకర్ ప్రేంచంద్ వ్రాసిన మరొక కథానికల సంపుటిని ప్రచురించింది. ఇది 'నవనిధి' అనే పేరుతో వెలువడింది. ఇందులో బుందేలీ శౌర్యానికి చిహ్నాలైన 'రాజా హర్‌దౌల్', 'రాణీ సారంధా' మొదలైన ప్రసిద్ధ కథలున్నవి.

తరువాత కొలదికాలానికే ప్రేంచంద్ హిందీలో "ప్రేం పూర్ణిమా" అనే మరొక కథానికల సంపుటాన్ని ప్రచురించినాడు. 'బడే ఘర్‌కీ బేటీ' 'పంచ్ పరమేశ్వర్' కథల కోవకు చెందిన "ఈశ్వరీయ న్యాయ' అనే అద్భుతమైన కథ ఇందులోనిదే. ఒక సంపన్న గృహస్థుని ఆశ్రయించుకొని అంతవరకూ నీతిగా ధైర్యంగా ఉండిన ఒక స్తుతిపారకుడు అటుతరువాత యజమాని వితంతువుకూ, శిశువుకూ ద్రోహం తలపెట్టి మోసం చేస్తాడు. పత్రాలన్నీ తన స్వాధీనంలో పెట్టుకొని వాళ్ళ ఆస్తిని కాజేయటానికి నిశ్చయించుకుంటాడు. న్యాయస్థానంలో వ్యాజ్యం నడుస్తది ఆ వితంతువు ఓడిపోయి న్యాయసభలో బహిరంగంగా ఆతణ్ణి "ఆస్తి నాదే అని ప్రమాణం చేయి" అని అంటది. కాని ఆతని లోలోపల ఉండే న్యాయస్వభావం చివరకు జయించి ఆతడు ప్రమాణం చేయలేకపోతాడు. ప్రేంచంద్ సంకలనంలో ఇది విలక్షణమైన కథ. మానవుడు మంచి చెడుగుల సమ్మిశ్రణం. అతడు పతితుడైకూడా చివరకు తేరుకుంటాడు. ఇది మానవునిలోని స్వభావసిద్ధమైన మంచితనంమీద రూసోకు ఉన్న విశ్వాసం వంటిది. నవనాగరకతాకు తర్కాల మూలంగా ఈ విశ్వాసం అనేక సందర్భాలలో క్రుంగిపోతున్నది.

1916-1917 మధ్యలో ప్రేంచంద్ తన గొప్పనవలల్లో మొదటిదైన 'సేవాసదన్' లేదా "బాజారె హుస్నా" వ్రాయటంలో నిమగ్నుడైనాడు. దానిని మొదట ఉర్దూలోనే వ్రాసినాడు. కాని దాని హిందీ అనువాదమే మొదట వెలువడింది. దానిని ఉర్దూలో ప్రచురించటానికి సంప్రతింపులు కొనసాగుతుండగానే 1918 లో హిందీ పుస్తక్ ఏజన్సీవారు దానిని హిందీలో ప్రచురించినారు. ఈ నవలకై ప్రచురణకర్తలు ప్రేంచంద్‌కు నన్నూరు రూపాయలు ఇచ్చినారు.

హిందీలోకాని ఉర్దూలోకాని వచ్చిన గొప్ప సాంఘిక నవలల్లో 'సేవాసదన్ మొదటిది. ఇంతవరకు హిందీనవలల్లో సాహసకృత్యాలు అద్భుతాలు ప్రబలంగా ఉండేవి. ఇందులో రచయిత దేనిని నిందించకుండా తగ్గించకుండా జీవితంలోని కఠోరసత్యాలను ధైర్యంగా ఎదుర్కొంటాడు. మానవుడు తన జీవితాన్ని పునర్నిర్మించుకోవటానికి శక్తుడనీ, మానవునికి తిరుగులేని అధోగతిలేదనీ తనకున్న

విశ్వాసాన్నికూడా ఆయన చెప్పుతాడు. ఇందులోని పాత్రలు పరిపక్వములు, సజీవములు. దీని ప్రచురణతో హిందీ నవలకు యుక్తవయస్సు వచ్చిందనే రూఢియైన సాక్ష్యం లభిస్తది.

సుమన్, ఈ నవలలో నాయిక. మంచిబట్టలు మంచితిండి అనే సహజమైన కోరికలు తీర్చి సంతృప్తి పరచలేని ఒక నిరుపేదతో ఆమెకు పెండ్లి జరుగుతది. ఆమె తండ్రి నీతిపరుడైన పోలీసు అధికారి. అవినీతికి పాల్పడే పోలీసు బలగమంతా తమకు ఆతడొక అడ్డుపుల్ల అని ఏవగించుకుంటారు. తన కూతురు పెండ్లికోసం అతడుకూడ కాలుజారి పతితుడైపోతాడు. అతణ్ణి నిర్బంధించి దోషిగా నిరూపిస్తారు.

స్నేహితురాలి యింటివద్ద చాలాసేపు ఉండివచ్చిన సుమన్‌మీద ఇదివరకే ఆమె స్వభావం నచ్చని భర్తకు కోపంవచ్చి ఒకరాత్రి ఆమెను ఇంటినుండి బయటికి వెళ్ళగొడుతాడు. ఆమె తన స్నేహితురాలి యింటికి ఆశ్రయానికై పోతది కాని ఆమెకు ఆశ్రయం లభించదు. చివరకు తమ యింటికి ఎదురుగా ఉండే ఒక వేశ్య ఆమెకు ఆశ్రయం ఇస్తది. ఈ విధంగా సుమన్ గౌరవం కోలుపోతది. ఆమె తన పునరావాసంకోసం చేసే ప్రయత్నాలన్నింటిని సనాతనాచారపరాయణులు గట్టిగా నిరోధిస్తారు. వాళ్ళు వేశ్యను గౌరవిస్తారు కాని కష్టాలుపడే కులకాంతను తృణీకరిస్తారు. ఆమెకు తన కడగండ్ల పరిష్కారం ఊహాకల్పిత ఆదర్శసంఘంలోనే కనిపిస్తది. అందులో అందరూ నీతిగా హాయిగా బ్రతుకవచ్చు.

ఇందులో సామాజికదృశ్య చిత్రణం స్పష్టంగాను నమ్మదగినదిగాను ఉన్నది. ప్రేంచంద్‌లోని ప్రగాఢమానవతాత్మ తాను సృష్టించిన పాత్రలను కరుణాపూరిత సానుభూతితో చూస్తూ దుఃఖపూరితమూ, విషాదపూరితమూ ఐన వారి జీవితగతిని గాఢాభిమానంతో అనుసరిస్తది. కథకు కాంతిని కదలికను నాటకీయతను కలిగిస్తూ ఇందులో సజీవమూ, శక్తివంతమూ ఐన అనేక ప్రముఖపాత్రలు ప్రకాశిస్తవి.

'సేవాసదన్' నవలకు సంబంధించిన పని ముగించిన కొలది మాసాలకే ప్రేంచంద్ తన రెండవ గొప్పనవల 'ప్రేమాశ్రం'కు ఉర్దూమూలం 'గోషై ఆఫియత్' వ్రాయటం ప్రారంభించినాడు. క్రొత్త నవల 1918 మే రెండవనాడు వ్రాయటం ప్రారంభించి 1920 ఫిబ్రవరి 25 నాడు ముగించినాడు. భారత జాతీయోద్యమం తీవ్రరూపం ధరించటం భూమికగా ఈ నవల రచన జరిగింది. గాంధీ

గారి సత్యాగ్రహోద్యమం ప్రగాఢముద్ర ఇందులో కనుపడుతది. అవి రౌలట్ చట్టం, మార్షల్‌లా, జలియన్‌వాలా బాగ్‌ల రోజులు.

ఈ నవలకు నాయకుడైన ప్రేంశంకర్‌లో ప్రేంచంద్ తన ఆదర్శ నూతన మానవుణ్ణి ప్రవేశ పెడుతాడు. అతడు శాంత స్వభావుడు, ఓరిమి గలవాడు, కాని అన్యాయంముందు లొంగిపోడు. అతడు భూస్వామ్యకుటుంబంలో పుట్టినా కర్షకులయెడ ప్రగాఢసానుభూతి కలవాడు. ఈ నవలలో ప్రేంచంద్ గ్రామీణసమాజపు కష్టాలు విపులంగా చిత్రిస్తాడు. కృషీవలుణ్ణి పీల్చి పిప్పిచేయటానికి ఎందరో క్రూరులు దోపరులు చుట్టుముడుతారు. జ్ఞాన్‌శంకర్ దౌష్ట్యం ఆకారం తాల్చినవాడు. కాని ప్రేంశంకర్ మాత్రం తనలోని గాఢమైన మానవత్వము మంచితనముల మూలంగా దుష్టశక్తులన్నింటినీ గెలుస్తాడు. ఆతని సహిష్ణుత శత్రువులను మిత్రులుగా మారుస్తది. అతడు 'ప్రేమాశ్రం' నెలకొల్పుతాడు. అక్కడ ఎవరైనా భూమిని సాగుచేసుకొని చాలినంత ఆదరువు కూర్చుకోవచ్చు.

ప్రేంచంద్ గోరఖ్పూర్‌లో ఉన్నప్పుడు రఘుపతి సహాయ్ 'ఫిరాఖ్'తో స్నేహం చేసినాడు. అప్పుడు 'ఫిరాఖ్' అల్హాబాద్ ముయిర్ సెంట్రల్ కాలేజీలో చదువుతూ వేసవి సెలవులలో ఇంటికి చేరుకున్నాడు. 'ఫిరాఖ్' ఇట్లా అంటాడు. "ప్రేంచంద్ ఇల్లు నాకు రెండవ ఆవాసగృహం. ప్రతిదినం సాయంకాలం నేను ఆయన యింటికి పోయేవాణ్ణి. ఇంటి బయట ఆవరణంలో ఎప్పుడూ రెండుమూడు కుర్చీలు వాల్చి ఉండేవి. ఒకదానిలో ప్రేంచంద్ కూర్చొని ఉండేవాడు. నేను ఆయన ప్రక్కనే వచ్చి కూర్చునేవాణ్ణి. మేము గంటల తరబడి ముచ్చటించుకునేవాళ్ళం. సూర్యాస్తమయానికి రెండుమూడు గంటలముందే నేను ప్రేంచంద్ ఇల్లు చేరుకునేవాణ్ణి. ప్రొద్దుగుంకే సమయానికి ప్రేంచంద్ కాశీపంచె చేతపట్టుకొని కూరగాయలు కొనుక్కోవటానికి ప్రక్కన ఉండే ఉర్దూబజార్ వెళ్ళేవాడు. నేను మా యింటికి పోయేవాణ్ణి."

'ఫిరాఖ్' తోడి స్నేహం ప్రేంచంద్ జీవితాంతంవరకు నిలిచింది. విమర్శ మొదలైన ఇతరమార్గాలు త్రొక్కినా 'ఫిరాఖ్' తత్వతః కవి. ఉర్దూ కవిత్వమంటె ప్రేంచంద్ అభిముఖ్యం కనపరచటం లేదని 'ఫిరాఖ్' అన్నాడు.

ఈ కాలంలోనే లాహోర్‌వాసి ఇమ్తియాజ్ అలీ 'తాజ్' తో ప్రేంచంద్ గాఢస్నేహం చేసినాడు, తాజ్ 'కహ్కాషా' పత్రికకు సంపాదకుడు. ప్రేంచంద్ ఆ పత్రికకు వరుసగా వ్రాస్తుండేవాడు. అతనికి "దారుల్ ఇషాకత్" అనే ప్రచు

రణ సంస్థకూడ ఉండేది. తాజ్ ప్రేంచంద్ వ్రాసిన చాలా గ్రంధాలు 'బాజారె హూస్న్' 'ప్రేంబత్తీసీ' (రెండవభాగం) 'ప్రేంపచ్చీసీ' (రెండవభాగం) అటుతరువాత 'గోషై ఆఫియత్' మొదలైనవి ప్రచురించినాడు. ఈ యిద్దరు స్నేహితులు తరుచుగా ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాసుకునేవారు. కాని వాళ్ళు కలుసుకోవటానికి మాత్రం కొన్ని ఏండ్లు పట్టింది.

గోరఖ్పూర్‌లో ఉండినప్పుడే ప్రేంచంద్ అల్హాబాదు విశ్వవిద్యాలయం నుండి బి.ఏ. పరీక్ష ద్వితీయశ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు. అది జాతీయ విప్లవం పెల్లుబుకుతున్న కాలం. నార్మల్ స్కూల్‌లో జరిగిన విజయోత్సవాలకు ప్రేంచంద్ వెళ్ళలేదు. అందుకోసం విద్యాశాఖ డైరక్టరు మెకంజీ ప్రధానోపాధ్యాయుణ్ణి లిఖితపూర్వక సమాధానం కోరినాడు. కలెక్టరుతోడి మరొక సంఘటనలో కూడ ప్రేంచంద్ చిక్కుకున్నాడు. కలెక్టరు భవనం ఆవరణంలో ప్రేంచంద్ ఆవు మేస్తుండేది. ఆవును కాల్చివేస్తానని కలెక్టరు బెదరించినాడు. ఇతరుల ఆవరణాలలోనికి తమ ఆవులను తోలేవాళ్ళ హక్కును రక్షించటమనేది కష్టమైనదైనా విదేశీపాలకుల గర్వాహంకారలకు ఎదురొడ్డి ప్రేంచంద్ నిజంగా జాతి ఆత్మగౌరవంకోసం నిలబడ్డాడు.

ప్రేంచంద్ పాత శిష్యులలో ఒకడు ఇటువంటి సంఘటనమే మరొకటి ఉటంకించినాడు.

"కలెక్టరు బంగ్లాకు నార్మల్‌స్కూల్ ఆవరణానికి మధ్యన ఒక పక్కా రోడ్డు ఉన్నది. అది నార్మల్‌స్కూల్ ఆవరణం వెంబడి ఆగ్నేయదిశనుండి వాయవ్య దిశగా పట్టణంవైపు పోతది ప్రతిదినం సాయంకాలం నాల్గుగంటలకు కలెక్టరు ఈరోడ్డు మీదుగానే వాహ్యాళి వెళ్ళేవాడు. రోడ్డుకు దక్షిణంవైపు మున్షీ ప్రేంచంద్ గారి యిల్లు ఉండేది. నాల్గుగంటల తరువాత మాస్టరుగారు వరాండాలో కూర్చొని నవలలు చదువటంలో నిమగ్నులై ఉండేవారు. ఒకనాడు కలెక్టరు వారిని దగ్గరికి రమ్మని పిల్చినాడు. మాస్టరుగారు సమీపించగానే అదొర ఇట్లా అన్నాడు. 'నేను ఈ ప్రక్కనుండే ప్రతిదినం వెళ్ళుతుంటాను. నీవు నమస్కరించటానికి రావెందుకు?' మాస్టరుగారు ఈవిధంగా సమాధానం చెప్పినారు. 'నేను నాపనిలో నిమగ్నుణ్ణై ఉన్నాను. దారివెంట పోయే ప్రతివానికి - ఆతడు ప్రభుత్వోద్యోగి ఐనా సరే - నమస్కరించటం నా విధి కాదు (ఈ సంఘటననే మరొకవిధంగా చెప్పే దానిలో పాఠశాలల ఇన్స్పెక్టర్ నిందితుడు).

మరునాడు ప్రేంచంద్ కలెక్టరుపై సివిల్‌కోర్టులో అభియోగం తెచ్చినాడు. చివరికి ఒప్పందం కుదిరి ఆ విషయం అంతటితో ముగిసింది.

ప్రభుత్వోద్యోగం మానుకునేటందుకు ప్రేంచంద్ సన్నద్ధుడౌతున్నాడనటానికి ఈ సంఘటలన్నీ సూచనలు.

# VII

ప్రభుత్వోద్యోగమంటే చిరచిరలాడుతూ ప్రేంచంద్ సాహిత్యకృషికి పత్రికావ్యాసంగానికి తాను వినియోగపడవలెనని అనుకునేవాడు. 'జమానా' పత్రిక ఆర్థికంగా దయనీయ పరిస్థితులలో ఉండినందువలన ఆయనకేమీ అవకాశం కల్పించలేకపోయింది. సంయుక్తపరగణాల ప్రభుత్వంవారి 'వార్‌జర్నల్' (యుద్ధసమాచారపత్రిక) ఉర్దూ సంచికను నిర్వహించవలసిందిగా ఒకప్పుడు నిగమ్ ప్రేంచంద్‌కు సూచించినాడు. ప్రేంచంద్ ఆకోర్కెను త్రోసిపుచ్చినాడు. మార్వాడీ పాఠశాలలో సహోపాధ్యాయుడుగా పనిచేయుమని కూడ నిగమ్ సూచించినాడు. కాని ప్రేంచంద్ కనీసం ప్రధానోపాధ్యాయపదవి లభిస్తేనేకాని తనకు చాలినంత తీరిక స్వాతంత్ర్యం ఉండవన్నాడు. ప్రేంచంద్ నిగమ్‌కు వ్రాసిన పెక్కు జాబులలో ఆయన కోరికలు ఆశలు వెల్లడి ఔతవి. ప్రేంచంద్ మనస్సు ఎటువంటిదో ఈ ఉత్తరాలు బాగా వివరిస్తవి.

సంయుక్త పరగణాల 'వార్ జర్నల్'ను ఉద్దేశించి ప్రేంచంద్ నిగమ్‌కు ఇట్లా వ్రాసినాడు. "దురదృష్టవశాత్తు ఇది జాతీయకార్యమని నేను భావించను. అనువాదం ప్రారంభదశలో ఉన్నవాడు చేయవలసినపనేగాని పత్రికారచనతో దానికేమీ సంబంధం లేదు. ఈ విషయమై దయచేసి నన్ను క్షమించండి."

ఇంతకుపూర్వం నిగమ్‌కు వ్రాసిన ఒకజాబులో ఆయన ఇట్లా అంటాడు. "ఈ దశలో నేను ప్రభుత్వపు పాత్రికేయుణ్ణి కాలేను. యుద్ధంగురించి వ్యాసాలు వ్రాసే తీరికకూడ నాకు లేదు. మునుపటి పాత నడకే సాగిస్తాను. బి. ఎ. పాసైన తరువాత ప్రైవేటు స్కూలు ప్రధానోపాధ్యాయుడుగా, ఒకమంచి పత్రిక సంపాదకుడుగా, ఏదో ప్రజాకార్యకర్తగా ఉండిపోతాను. ఇదే నా జీవితానికి పరాకాష్ఠ. నా పత్రిక కర్షకులతోను కార్మికులతోను స్నేహంగాఉండి వారినే బలపరుస్తది."

చాలినంత ఆర్థికసహాయం లేకుండా 'జమానా' పత్రికలో చేరటానికి తన అశక్తతను వెల్లడిస్తూ ఆయన ఈవిధంగా వ్రాస్తాడు. "ఇది నాకు తగిన వృత్తి కాదని మీరంటున్నారు నేనూ ఒప్పుకుంటాను. కాని గత్యంతరం లేదు త్యాగాలు నా ఒక్కనికొరకే పరిమితం చేయదలుచుకున్నాను. ఈ యంత్రంలోనే నా పిల్లలుకూడా నలిగిపోవాలెనని నేను కోరను. తిండైనా కనీసం సంపాదించగలను. ఏదో సాహిత్య వ్యాసంగంకూడ చేయగలుగుతున్నాను. ఇదే నా త్యాగం. భగవంతునితోను ప్రపంచంతోను - సంఘంతోను స్వవ్యక్తితోను - ఇరుపక్షాలతోను సమ్మతిగానే సాగిపోతున్నాను సాహిత్య వ్యాసంగం స్వల్పమైన త్యాగంగా నేను భావించటం లేదు."

ఈ కాలంలోనే ప్రేంచంద్ కొడుకు మన్నూ స్ఫోటకం పోసి చనిపోయినాడు. ప్రేంచంద్ చాలా దుఃఖించినాడు. కాని తన దుఃఖాన్ని జయించి భార్యను ఓదార్చటానికి ప్రయత్నించినాడు. ప్రేంచంద్ ఆరోగ్యం కూడ సరిగా లేకుండె. ఆయన తన పూర్వాకారపు నీడగా మిగిలిపోయినాడు

సొంత ప్రెస్ పెట్టుకోవాలెనని ప్రేంచంద్‌కు అపేక్ష ఉండేది. ఆయన తమ్ముడు మెహ్తాబ్‌రాయ్ కలకత్తాలో మహావీర్ ప్రసాద్ పోద్దార్ గారి హిందీ పుస్తక్ ఏజన్సీలో పనిచేసినవాడు కాబట్టి ఇటువంటి పనిలో కొంత అనుభవం గడించినాడు. కలకత్తాలోని ఒక ప్రెస్‌లో యాభైశాతం వాటాలు తీసుకోవటానికి ప్రేంచంద్ సంసిద్ధుడైనాడు ఏదోవిధంగా కావలసిన పైకం కూర్చుకున్నాడు. మెహ్తాబ్‌రాయ్ ఆ ప్రెస్ తన పేరుతో కొంటాడని ఆశించినాడు. కాని శివరాణీదేవి తన పెద్ద కొడుకు శ్రీపత్‌రాయ్ పేరుతో కొనవలసిందని పట్టు పట్టింది. దానితో ఆ ప్రయత్నం భంగమైపోయింది. శివరాణీదేవి లౌకిక విషయాలలో భర్తకంటె చురుకైనదిగా కనుపడుతది. బనారస్‌లో ఒక ప్రెస్సు పెట్టుకొని అక్కడనే స్థిరపడిపోవాలెనని ప్రేంచంద్ ఇప్పటినుండి ఊహించసాగినాడు.

గాంధీగారి సత్యాగ్రహోద్యమం దావాగ్నివలె వ్యాపించసాగింది. ఈ ఉద్యమం ప్రభావం ప్రేంచంద్ మీద గాఢంగా పడింది. దేశమంతటా సుడిగాలి వలె తిరుగుతూ గాంధిగారు 1921 ఫిబ్రవరి 8 నాడు గోరఖ్పూర్ మీదుగా వెళ్ళినారు. ఆ పట్టణంలో ఒక గొప్ప బహిరంగ సభలో మహాత్ముడు మాట్లాడినాడు. 1921 ఫిబ్రవరి 15 నాడు ప్రేంచంద్ ప్రభుత్వోద్యోగం నుండి విరమించుకొన్నాడు. జీవితంలో అతి ప్రధానమైన ఈ నిర్ణయం తీసుకోవటంలో ఆయనకు శివరాణీదేవి సంపూర్ణ సహకారం లభించింది. ఆమె ప్రేంచంద్‌తో "ఈ ఉద్యోగం విడిచిపెట్టండి. ప్రభుత్వసిధాంతాలు ఇప్పుడు దుర్భరమై పోయినవి " అన్నది.

అలవాటు ప్రకారం గట్టిగా నవ్వుతూ ఆయన "నిర్ణయించటానికి ముందు బాగా ఆలోచించు" అన్నాడు.

ఆమె ఈ విధంగా సమాధానం చెప్పింది. "నేను ఈ విషయం బాగా ఆలోచించినాను. మీరిప్పుడు మంచిగా ఉన్నారు, కనుక నేను అడవిలో గూడ సంతోషంగా ఉండగలను. మనకు మంచి భవిష్యత్తే ఉన్నదని నా నమ్మకం."

ఫిబ్రవరి 16 నాడు ప్రేంచంద్‌కు తన ఉద్యోగవిధులనుండి విముక్తి లభించింది. ఆనాడే ఆయన తన అధికార నివాసగృహం విడిచిపెట్టి ఒక స్నేహితుని యింటికి మారినాడు. ఒక ప్రెస్సు, ఒక పత్రిక ఇటువంటివే ఎన్నో ప్రణాళికల గురించి ఆలోచించ సాగినాడు. కాని వీటికన్నింటికీ డబ్బుకావలె నూలు వడికే వ్యాపారం చిన్నదొకటి స్థాపించినాడు. కాని అది ఆతనికి తగిన సంతృప్తి కలిగించ లేదు. 1921 మార్చి 18 నాడు ప్రేంచంద్ గోరఖ్పూర్ విడిచిపెట్టి బనారస్ వెళ్ళిపోయినాడు.

గాంధీతత్వం గూర్చి వ్రాస్తూ ప్రచారం చేస్తూ ఆయన కొంతకాలం లమహీలో ఉండిపోయినాడు. కాని ఆయనకు నెమ్మది కలుగలేదు. ఇంటిలో సవతి తల్లికి తన భార్యకు జరిగే కొట్లాటలతో ఆయన విసిగి పోయినాడు. జూలైలో కాన్పూర్ వెళ్ళిపోయినాడు. అక్కడి మర్వాడీ పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగా నియుక్తుడైనాడు. ఇక్కడ జాతీయ రాజకీయ జీవితపు సుడిగుండంలో దుమికినందుకైనా ఆయన సంతోషంగా ఉండవలసి ఉండె. కాని ఆ పాఠశాల మేనేజరుతో ఆయనకు సరిపడ లేదు. ఆ మేనేజరు ప్రేంచంద్ పనిలో ఎప్పుడూ లోక్యం కల్పించుకొనేవాడు. చిట్టచివరకు ప్రేంచంద్ 1922 ఫిబ్రవరి 22 నాడు ఉద్యోగం విడిచిపెట్టి బనారస్‌కు తిరిగిపోయినాడు.

బనారస్‌లో ఆయన జ్ఞానమండలితో పనిచేసినాడు. 'మర్యాద' ప్రకటనలో సహకరించినాడు. 'ఆజ్' పత్రికకు వ్రాసేవాడు, అటు తరువాత కాశీవిద్యాపీఠం పాఠశాలా విభాగం బాధ్యత స్వీకరించినాడు. అసౌకర్యం లేకుండా పని చేసుకోవటానికని లమహీలోని తన ఇంటిని బాగుచేయించుకొన్నాడు. బనారస్‌లో సొంత ప్రెస్ పెట్టుకోవటానికి కూడ ఉపాయాలు పన్నసాగినాడు. దానికి 'సరస్వతీ ప్రెస్' అని పేరు పెట్టినాడు. ప్రేంచంద్ అనే కలంపేరు వలెనే ఈ పేరుకూడ దయా నారాయణ్ నిగమ్ సూచించినదే. ఆ ప్రెస్సు ప్రేంచంద్ పాలిటికి ఎడతెగని తల నొప్పిగా పరిణమించింది. దాని కోసం ఎంతో ధనాన్ని శ్రమను వ్యయం చేసినాడు.

ఆయనకు శాంతి కరువైపోయింది చాలా ఏండ్ల తరువాత ఆయన ఈ విధంగా వ్రాసినాడు. "ఈ ప్రెస్సే సర్వానర్థాలకు మూలం. ఏదుష్టగడియల్లో దీనికి శంకు స్థాపనం జరిగిందో భగవంతునికే ఎరుక. పదివేల రూపాయలు పదకొండేండ్ల పరిశ్రమ ఎంతో హృదయవేదన — అన్నీ వ్యర్థమై పోయినవి. ఈ ప్రెస్సు మూలంగానే అనేక మిత్రుల అయిష్టానికి పాల్పడ్డాను. ఇతర అనేకుల విషయంలో నా మాట నిలబెట్టుకోలేక పోయినాను. చదువుకోవటానికి వ్రాసుకోవటానికి వినియోగం చేయవలసిన అమూల్యసమయాన్ని నిరర్థకమైన ప్రూపులు దిద్దటంలో వృథా చేసినాను. నా జీవితంలో అన్నింటికంటె పెద్ద పొరపాటు ఇదే."

# VIII

ఇప్పటినుండి ప్రేంచంద్ కలం చురుకుగా పనిచేయసాగింది. ఆయన 'సంగ్రామ్' 'కర్బలా' అనే రెండు నాటకాలు, లెక్కలేనన్ని కథానికలు వ్రాసినాడు. తన నవలాసాహిత్యంలో అత్యుత్కృష్టమైన 'రంగభూమి' రచనకు పూనుకొన్నాడు. 'సంగ్రామ్' నాటకానికి జాతీయోద్యమం, 'కర్బలా' నాటకానికి ఆనాడు దేశాన్ని గడగడలాడించిన మతకలహాలు ఆధారం. ప్రేంచంద్ మతసామరస్యానికి నిష్పక్షపాతంగా నిలబడి శాంతిసందేశాన్ని తన రచనలద్వారా వ్యాపింపచేయటానికి సర్వవిధాల కృషిచేసినాడు. కాని మతోన్మాదం మహామారివలె దేశమంతటా వ్యాపించి సర్వనాశనం చేయసాగింది.

నిగమ్‌కు వ్రాసిన ఉత్తరాలలో ప్రేంచంద్ తన రాజకీయాభిప్రాయాలు వెల్లడి చేసినాడు. 1923 ఫిబ్రవరి 17 నాటి ఒక జాబులో ఇట్లా వ్రాసినాడు. 'నేను ఏ పార్టీవాణ్ణో అని మీరు అడుగుతున్నారు. నేను ఏ పార్టీ వాణ్ణి కాదు. ఎందుకంటె ఈ రెండు పార్టీలలో ఏదీ ప్రయోజనకరమైన పని ఏమీ చేయటం లేదు. పేదలకు రాజకీయ విద్య గరపటం తన కార్యక్రమంగా చేపట్టే భవిష్యత్ పార్టీయే నా పార్టీ' ఇంతకుముందే 1919 డిసెంబరు 21 నాడు నిగమ్‌కు ఈ విధంగా వ్రాసినాడు. "ఇప్పుడు నేను బోల్షివిజం సూత్రాలు దాదాపు సంపూర్ణంగా అంగీకరించినాను." ప్రేంచంద్ జాతీయ స్వాతంత్ర్యం కోసం, భారతదేశంలోని రెండు పెద్ద వర్గాల మధ్య సామరస్యం ఐకమత్యం కోసం, పేదలకు ఆర్థికావసరాలనుండి బాధలనుండి విముక్తి లభించటం కోసం కృషిచేసినాడు.

ప్రేంచంద్ 1922 అక్టోబరు 1 నాడు తన బృహత్ నవల 'రంగభూమి రచనకు ఉపక్రమించి 1924 ఏప్రిల్ 1 నాడు దాని ఉర్దూ ప్రతి పూర్తి చేసినాడు. 'సేవాసదన్' 'ప్రేమాశ్రమం' వలెనే దాని హిందీ అనువాదమే ముందుగా అచ్చైనది. తన ఉర్దూ రచనలు జాప్యంగా అచ్చుకావటం వలన ప్రేంచంద్ అధికాధికంగా హిందీవైపే మొగ్గినాడు.

లక్నో, గంగాపుస్తకమాల వారు 'రంగభూమి' ప్రచురించినారు. వారు అందుకోసం ఆయనకు 18 నూర్ల రూపాయలు ఇచ్చినారు. సొంత ప్రెస్సులో ఏర్పర్డ పెద్ద చిక్కు తొలగటానికి ఈ మొత్తం సహాయపడింది తనకు ఉపాధి కల్పించవలసిన ప్రెస్సును తానే మేపవలసివచ్చింది. గంగా పుస్తకమాలాధిపతి దులారేలాల్ భార్గవ ఒక సాహిత్య ఇతవరి కోసం వెదుకుతుండేవాడు. నెలకు నూరు రూపాయల వేతనం మీద ప్రేంచంద్ ఆపనికి అంగీకరించినాడు.

భారతదేశ నవల చరిత్రలో 'రంగభూమి' నాయకుడు సూర్‌దాస్ ఒక సాటిలేని పాత్ర. అతడొక గ్రుడ్డివాడు; వాహనాల వెంట ఉరుకుతూ పైసలు అడుక్కొంటాడు. వృత్తి బిచ్చం ఎత్తటమైనా మితిమీరిన స్వాభిమానం, హృదయౌదార్యం, ప్రజల హక్కులకోసం పోరాడే సామర్థ్యం ఆతనిలో సమ్మిశ్రిత మైనవి. ఆతనిలో మహాత్మాగాంధిగుణాలూ, భారతీయ పరంపరాగత భిక్షావృత్తీ మిశ్రితమైనవి. లమహీనో దాటిపోయే బండ్ల వెంటబడి పరుగెత్తుతూ చిల్లర డబ్బులు అడుక్కొనే ఇటువంటి ఒక అంధుణ్ణి ప్రేంచంద్ ఎరుగును. గోరఖ్పూర్‌లో పాటలుపాడే ఒక గ్రుడ్డి పిల్లవాణ్ణి ఆయన చూచినాడు. ప్రభుత్వోద్యోగం విరమించు కొన్న తరువాత ప్రేంచంద్ సాయంకాలాలు ఆ పిల్లవాని పాటలు వింటుండేవాడు. ఈ గ్రుడ్డి బిచ్చగాళ్ళ స్మృతులపైననే ఆధునిక భారత చరిత్రలో సర్వోత్కృష్ట భిక్షుకుడైన మహాత్మాగాంధీ వ్యక్తిత్వాన్ని విధించి ప్రేంచంద్ ఒక కొత్త పాత్రకు రూపకల్పన చేసినాడు.

'రంగభూమి' నవల అనేక శబలవర్ణతంతువుల పడుగుపేకల అల్లిక. బాధలతో దారిద్ర్యంతో సతమతమయ్యే గ్రామీణ సామాజిక జీవితం ఇందులోని ప్రధాన సూత్రం. ఊరి పశ్చిమబయలులో సిగరెట్ ఫ్యాక్టరీ పెట్టదలచిన జాన్‌సేవక్ క్రైస్తవకుటుంబమూ, అనేకవైరుధ్యాలు లోభం త్యాగం కీర్తికాంక్షగల ధనవంతులూ, ఆక్రమాలకు పాల్పడే సంస్థానాలు వంటి పాలకులూ ఇందులో ఉన్నారు. ఈ నవలలో చాలా సంఘటనలున్నవి. ఇందులోని సంఘటనలు వేగంగా - దాదాపు

భావోద్విగ్న నాటకంలో వలె జరుగుతవి. అది మెల్లగా రాజసంగా సమతలంలో ప్రవహించి ముంచెత్తే నీటివలె కాక కొండ చరియల్లో నుంచి ఉవ్వెత్తుగా దుమికే ప్రవాహం వంటిది.

ఈ నవలకు పటిష్ఠమైన నిర్మితిలేదు. ఇంతకు పూర్వం ప్రేంచంద్ చదివిన సాహసకథల ప్రభావంగల సూచన లెన్నో ఇందులో ఉన్నవి. సూర్‌దాస్‌కు కొద్ది పాటి పైకమిచ్చి ఆతని భూమి సంపాదించి జాన్‌సేవక్ పాండేపూర్‌లో తన ఫాక్టరీ స్థాపిస్తాడు. ఫాక్టరీ రావటంలో త్రాగుడు, జూదం, కొట్లాటలు, బూతు మొదలైన అనేక అనర్థాలు దాపురిస్తవి. మొదటిసారిగా గ్రామీణస్త్రీలు ఆగంతుకుల ఉపద్రవానికి గురి ఔతారు. కార్మికులకు వసతిగృహాలు నిర్మించటంకోసం గ్రామీణులను వాళ్ళ ఇండ్లనుండి వెళ్ళగొడుతారు. సూర్‌దాస్ పట్టణానికి పోయి తనకూ గ్రామీణులకూ జరిగిన అన్యాయాన్ని ఎదుర్కొనటానికి సమాజచైతన్యాన్ని పురికొల్పుతాడు. నిరంకుశులను ఎదుర్కొనటానికి ప్రజాకోపం ఉప్పొంగుతది. చివరకు తన గుడిసెను కాలుస్తున్న మంటల్లో సూర్‌దాస్ ఆహుతి ఐపోతాడు.

సోఫీ వినయ్‌ను ప్రేమించే కథ ఇందులో మధురమైన అంతర్ధారవలె సాగుతది. ఆతణ్ణి వెంబడించి ఆమె చాలా దూరప్రదేశాలకు పోతది. అన్యాయాలకు అక్రమాలకు ఎదురొడ్డి పోరాడుతది. వాళ్ళ ప్రేమ ఎన్నోకష్టాలను ఎదుర్కొని వాటి నన్నింటిని అధిగమిస్తది.

ప్రేంచంద్ వెనుకటి ఆదిమసంఘాలను ఊహాకల్పితమైన ఆదర్శాలుగా ఎన్నుకొన్నాడు. ఆయన భూస్వాముల పారిశ్రామికుల నిరంకుశత్వాన్ని నిరోధిస్తాడు. సామ్యవాదం అంటే సామాజిక సంపదపై ప్రజల యాజమాన్యం అనీ, అది పారిశ్రామికీకరణంవలని దుష్ఫలితాలను శమింపజేస్తుందనీ, యంత్రాలపై మానవుని అధికారం మానవుల కాయకష్టాన్ని తొలగిస్తుందనీ ఆయన గుర్తించలేక పోయినాడు.

సామాజికమైన అన్యాయాలను ఎదిరించటానికి ప్రజలను ప్రబోధించటమే ఈ నవలలో ఉన్నశక్తి. సమాజచైతన్యాన్ని అక్రమాలను ఎదిరించటానికి సూర్‌దాస్ పురికొల్పుతాడు. ప్రజాకోపం ముందు క్రూరులు గడగడలాడిపోతారు. అదేవిధంగా ఇంతకాలం దేశంలో అణగారి ఉన్న రాజస్థాన్ ప్రాంతంలోని బాధితప్రజలలో వినయ్ సోఫియాలు ఒక జాగృతిని కల్పిస్తారు.

ఈ విధంగా ఈ నవలలో ప్రేంచంద్ భారతదేశాన్ని విస్పష్టంగాను, శక్తివంతంగాను చిత్రిస్తాడు. ఈ విశాలపటావరణం మీద సమాజంలోని అన్ని వర్గాలు ఉజ్జీవితమై కనుపడుతవి. మరచిపోరాని ఎన్నో పాత్రల సృష్టి జరుగుతది ఈ నవలతో ప్రేంచంద్‌కు దేశవ్యాప్తమైన కీర్తి లభించింది. పాఠకులు స్వయంగానే ఆయనను 'ఉపన్యాస సమ్రాట్' అనే అనధికార బిరుదంతో గౌరవించినారు.

ఈ నవలలో ఎన్నో దీర్ఘనైతిక ప్రసంగాలున్నవి. జాన్ సేవక్, ఆతనిభార్య, ఈశ్వర్ సేవక్‌ల క్రైస్తవవాతావరణాన్ని సుహృద్భావంతో చిత్రించటం జరుగలేదు. కాకతాళీయంగా లోకంలో జరిగే విషయాలను ఆధారంగా తీసుకొని వినయ్ సోఫియాలు వాళ్ళ సాహసయాత్రల తరువాత ఆకస్మికంగా రైలుబండిలో కలుసుకొన్నట్లు చిత్రించిన సంఘటన నమ్మదగినట్లుగా లేదు. క్లార్క్ పర్యటనలు అన్నింటిలోను సోఫీ వెంట ఉండటం ఎట్లా జరిగిందో ఏమాత్రమూ స్పష్టపడదు. ఇటువంటి కొన్ని దోషాలున్నా 'రంగభూమి' గొప్ప సాహిత్య సృష్టి. హిందీ నవల చరిత్రలో అదొక మైలురాయి. ప్రేంచంద్ తన సృజనాత్మక భావన బలంతో నాగరక జానపద జీవిత వైవిధ్యాన్ని విశాల పటావరణంపై శక్తివంతంగా చిత్రించినాడు.

ప్రేంచంద్ లక్నోలో ఉన్నప్పుడు. 'సవా సేర్ గెహూం' 'షత్రంజ్‌కేఖిలాడీ' మొదలైన అత్యుత్తమకథలు వ్రాసినాడు. లమహీలో ప్రారంభించిన 'కాయకల్ప' నవలను పూర్తిచేసినాడు ప్రేంచంద్ మౌలికంగానే హిందీలో వ్రాసిన నవలల్లో ఇది మొదటిది. 1924 ఏప్రిల్ 10 నాడు దాని రచన ప్రారంభించినాడు. ఎడు మాసాలలో ప్రథమభాగం పూర్తి చేసినాడు. 1922 నవంబరు 12 నాడు ద్వితీయ భాగం రచించటానికి పూనుకొన్నాడు. ప్రేంచంద్ సొంతప్రెస్సులో 1926 లో ఆనవల అచ్చైనది.

'కాయకల్ప' నవలలో కొన్ని పారలౌకికధోరణులున్నవి. రైడర్ హాగర్డ్ సృష్టించిన షి వలె ఇందులో రాజ్‌కుమార్, రాణీదేవప్రియలు చైతన్యవంతులౌతారు. రాజ్‌కుమార్ పర్వతాలలో ఉంటాడు, యోగాభ్యాసం చేస్తాడు. సంకల్పమాత్రం చేత పైకెగిరే క్రిందికి దిగే వాయు విమానాలు కనిపెడుతాడు. ఈ ధోరణులు ప్రేంచంద్ అదే పనిగా నిర్మిస్తూవచ్చిన సాంఘికనవలలను చెరిచేవి. ఐనా "కాయకల్ప" నవలలో ఇటువంటి సాగదీసే ధోరణులు చాలా పరిమితంగానే ఉన్నవి. సాంఘిక మానవత్వరీతులను గాఢంగా అధ్యయనం చేసేవారికి కుతూహలం కలిగించే వస్తువు ఇందులో చాలినంత ఉన్నది. ఆగ్రాలో మతకల్లోలాలు చెలరేగుతవి.

గాంధేయపద్ధతుల ద్వారా చక్రధర్ శాంతి నెలకొల్పుతాడు. గ్రామాలలో భూస్వాముల దౌర్జన్యం పెచ్చు పెరుగుతది. ప్రజలు తిరగబడుతారు. ఈ సంఘటనలతో బాగా పెనవేసుకొని, మున్షీవజ్రధర్ ఆతని కుటుంబానికి చెందిన మానవత్వపు ఆకర్షణీయమైన కథ కూడ ఉన్నది. భోగ త్త, సేవల మూలంగా బ్రతుకు గడిపే ముసలి రాజసేవకుడు తండ్రి. కొడుకేమో ప్రజోద్యమకారుడుగా పరిణమిస్తాడు. ఐహిక జీవితంనుండి విరమించుకొనే విధంగా కనుపడుతాడు ఒక అనాథబాలికను పెండ్లి చేసుకొంటాడు. ఆమె ఒక తాలుకదారు కూతురని తేలుతది. చక్రధర్ కొడుకు శంఖధర్ కూడా తండ్రి మూసలో తయారైనవాడే.

ప్రపంచంలో న్యాయానికి సంబంధించిన సమస్యే ఈ నవలలో ముఖ్యాంశం. "ఇంత మితిమీరిన స్వార్థము అసూయ అన్యాయంతో నిండిన ప్రపంచాన్ని భగవంతుడు ఎందుకు సృష్టించినాడు? అందరు మనుష్యులూ, అన్ని సమాజాలూ శాంతి సంతోషాలతో ఉండే ప్రపంచం సృష్టించటానికి వీలులేకపోయిందా? ఒకరు భోగాలతో తృప్తిపడుతుంటే మరొకరు దిక్కులేకుండా ఉండేది ఎటువంటి న్యాయం? ఒక జాతి మరొక జాతి నెత్తురు పీల్చి పెత్తనం చేస్తుంటే మరొక జాతి ఆకలితో మాడుతూ పరాయి పాదాలక్రింద నలిగిపోవట మెందుకు? ఇటువంటి అన్యాయ ప్రపంచం భగవంతుడు సృష్టించి ఉండడు." అనే ఆలోచనలు ఈ నవల అంతటా వ్యాపించి ఉన్నవి.

ఈ కాలంలోనే ఒక కారు, ఒక బంగ్లా నెలకు నన్నూరు రూపాయల వేతనం మీద తన కొలువులో చేరటానికి అల్వార్ మహారాజు ప్రేంచంద్‌కు పురస్కారం పంపినాడు. ప్రేంచంద్ దాన్ని తిరస్కరించినాడు.

ప్రేంచంద్ కీర్తి దినదినం వర్ధిల్లుతుంటే కొందరికి ఈర్ష్య, కడుపుమంట కలిగినవి. అటువంటివారిలో శ్రీ బౌధ్ ఉపాధ్యాయ అనే ఆయన ప్రేంచంద్‌కు గ్రంథ చౌర్యం ఆపాదిస్తూ ఆయనకు విరుద్ధంగా ఆరునెలలవరకు వ్రాసినాడు. ప్రేంచంద్ సృష్టించిన ఆయా పాత్రలు ఆయా రచయితలను అనుకరించినట్లు నిరూపించటానికి అతిప్రయాసతో సుదీర్ఘ ప్రయత్నం చేసినాడు. ఇంకొక దుర్విమర్శకుడు ప్రేంచంద్‌ను "ద్వేషప్రచారకుడు" అన్నాడు.

ప్రేంచంద్ తన వ్యాసాల సంపుటం ఒకటి 'కలం త్యాగ్ ఔర్ తల్వార్' అనే పేరుతో సరస్వతీప్రెస్‌ద్వారా ప్రచురించినాడు. ఇవి తమ కలంద్వారానో త్యాగంమూలంగానో సేవచేసిన మహనీయుల జీవితచరిత్రలు. ఇందులో రాణా

ప్రతాప్, గారిబాల్డీ, గోఖ్లే, అక్బర్, వివేకానంద, రాజామాన్‌సింగ్, రాజాతోడర్ మల్ మొదలైనవారున్నారు. ఈ వ్యాసాలు ఇంతకు పూర్వం 'జమానా' పత్రికలో అచ్చైనవే.

కేవలం స్త్రీల సంక్షేమంకోసం వెలువడే 'చాంద్' పత్రిక కథానికల ప్రత్యేక సంచికకు ప్రేంచంద్ సంపాదకుడుగా ఉన్నాడు. చాంద్ పబ్లిషర్స్‌వారు ప్రేంచంద్ కథానికల సంపుటం 'ప్రేం ప్రమోద్' కూడ ప్రచురించినారు. సరస్వతీ ప్రెస్ నష్టంతో నడుస్తుండేది. అందుకోసం ప్రేంచంద్ మళ్ళా ఉద్యోగం సంపాదించుకొని లక్నో వెళ్ళినాడు. అక్కడ 'మాధురీ' సంపాదకుడుగా నెలకు ఇనూరు రూపాయలజీతంమీద కుదురుకొన్నాడు.

'చాంద్' పత్రికలో ప్రేంచంద్ వ్రాసిన 'నిర్మల' అనే నవల 1925 నవంబరు నుండి 1926 నవంబరు వరకు ధారావాహికంగా వెలువడింది. ఆయన వ్రాసిన ఇతర నవలలతో పోలిస్తే ఇది చాలా చిన్నది. భారతీయ స్త్రీ జీవితాన్ని విషాక్తం చేసిన వరకట్నపు దురాచారం ఇందులోని ఇతివృత్తం. తండ్రి చచ్చిపోయినందున నిర్మల ఒక మధ్య వయస్కుడైన విధురుణ్ణి పెండ్లి చేసుకొనవలసి వస్తది. ముందుగా నిశ్చయమైన వరుడు పెద్ద కట్నం కోసం ఇతరత్ర వివాహం చేసుకొంటాడు హిందూ సమాజంలో ఉన్న దురాచారాలను ఈ కథ విశదంగా బహిర్గతం చేస్తది. 'చాంద్' పత్రిక చదివేవాళ్ళు అధిక సంఖ్యాకులు స్త్రీలే కనుక వాళ్ళలో ఈ నవలకు బాగా ప్రచారం వచ్చింది. 'నిర్మల' ధారా వాహిక ప్రచురణ 'చాంద్'లో ముగియగానే ప్రేంచంద్ అదే పత్రికలో మరో నవలిక ప్రారంభించినాడు. ఇంతకు పూర్వం వ్రాసిన 'ప్రేమ'ను సవరించి 'ప్రతిజ్ఞ' అనే పేరుతో ప్రచురించినాడు. 'చాంద్' పత్రికలో అది 1927 జనవరి నుండి నవంబరు వరకు వెలువడింది.

'మాధురీ' పత్రికకోసం ప్రేంచంద్ 1928 జనవరిలో ఒక కథ వ్రాసినాడు. అది 'మోటే రాంశాస్త్రి' అనే హాస్య రచన. లక్నోవాసియైన ఒక ప్రఖ్యాత వైద్యుడు ఆ అవహేళనాత్మకరచన తనపైన చేసినదే అని నమ్మినాడు ఆయన 'మాధురీ పత్రిక సంపాదకులమీద ముద్రాపకులమీద ప్రచురణకర్తలమీద నష్ట పరిహారం దావా వేసినాడు. ఆ వ్యంగ్యరచన ఏ ఒక వ్యక్తిని ఉద్దేశించి చేసినది కాదని సంపాదకులు వివరించినారు. సనాతనాచారపరాయణులై వెనుక పడిన వైద్యులను సమష్టిగా బహిరంగం చేయటమే దాని ఉద్దేశం అన్నారు. 'మాధురీ'

పత్రిక, నవల్‌కిషోర్ ప్రెస్సులనుండి అప్పుడప్పుడే తొలగింపబడినవాళ్ళు కొందరు ఎంత విసిగించాలెనని ప్రయత్నించినా ఆ వ్యాజ్యం తొందరగానే ముగిసింది.

ప్రేంచంద్ కుమారుడు అమృతరాయ్ తన తండ్రి జీవిత చరిత్రం 'కలం కా సిపాహీ' కోసం సామగ్రి సేకరిస్తుండగా అదృష్టవశాత్తు ఆతనికి ఒక డైరీ దొరికింది. అది ప్రేంచంద్ లక్నో జీవితానికి సంబంధించినది. అందులో కొన్ని ఆరోపాలు ఈ విధంగా ఉన్నవి.

ఫిబ్రవరి 11. 'హోం అరిథ్‌మెటిక్' వ్రాత ప్రతి చదివి దాని గూర్చి రిపోర్టు వ్రాసినాను. మాన్యువల్‌గ్రామర్ గూర్చి ఒక ప్రకటన వ్రాసినాను.

మాధురీ గ్రంథమాల కోసం ఒక ప్రణాళిక సిద్ధం చేసినాను.

'సైరె కోహ్సార్'లో రెండు పుటలు అనువాదం చేసినాను.

ఫిబ్రవరి 12. ఆదివారం.

ఫిబ్రవరి 13. దాదాపు మూడు పుటలు అనువాదం చేసినాను. 'బిజక్' కోసం విచార్‌దాస్‌కు జాబు వ్రాసినాను. బుక్ డిపో కోసం కొన్ని ప్రకటనలకు మెరుగులు దిద్దినాను. 'థార్న్ ఇన్ ది ఫ్లవర్' లో కొన్ని పుటలు సవరించినాను. 'భారత్ కథా కౌముది' కోసం డిపార్టుమెంటుకు బ్లాకులు పంపించినాను. 'థార్న్ ఇన్ ది ఫ్లవర్' లో 15 పుటలు సవరించినాను 'కోహె సార్'లో రెండు పుటలు అనువాదం చేసినాను....

'మాధురీ' పత్రికకు సంపాదకుడుగా ఉండటమే కాక నవల్ కిషోర్ ప్రెస్సు కోసం ప్రేంచంద్ చిల్లర పనులు చాలా చేసేవాడని ఈ ఆరోపాలవలన తెలుస్తున్నది ఈ కాలంలో ప్రేంచంద్ సహచరుడుగా ఉండిన మిర్జా మహమ్మద్ అస్కరీ ఆతని గూర్చి ఈ విధంగా వ్రాసినాడు.

'ఈ రెండు మూడేండ్లు ఆతడెప్పుడూ సంతోషంగా ఉన్నాడు ఆతని ముఖం ఎల్లప్పుడు కలకలలాడుతుండేది. ఆయన ముఖంలో నేనెప్పుడూ కోపచ్ఛాయలు చూడలేదు. అప్పుడప్పుడు నవ్వుతూ ఆయనతో "మీకు కోపం ఎప్పుడూ రాదా? ఇంటి వద్ద కూడా మీరు విసుక్కోరా?" అని అడిగితే ఆయన నవ్వేవాడు. మాధురీ పత్రిక కార్యాలయం పైఅంతస్థు గదిలో ఉండేది. కాని మున్షీగారు (ప్రేంచంద్) మరికొందరు 'మాధురీ' ఉద్యోగులు నా గది ప్రక్కనే సమావేశం అయ్యేవారు. ఆయన సహచరులందరూ ఆయన సజీవమైన హాస్యాన్ని, మంచితనాన్ని, పరిహాస కౌశలాన్ని చూచి ఆనందించేవారు. ఆయన నవ్వులతో గది ప్రతిధ్వనించేది ఆ ప్రతిధ్వని గగనంతా ప్రకాశమానం చేస్తున్నట్లుండేది. 'నవాదిర్' అనే నా పుస్తకం

లోని కథలు ఆయనకు వినిపించేవాణ్ణి. ఆయనకు ఒక మొఅజ్జిన్ కథ వినిపించి నాను. ఆ మొఅజ్జిన్ ప్రార్థించటానికి భక్తులను పిలిచి తాను ఆ ప్రదేశంనుండి పరుగెత్తేవాడు. అట్లా ఎందుకు చేస్తావని అడిగితే ప్రార్థన ఘోష ఏ విధంగా విన పడుతదో తెలుసుకోవటానికని చెప్పేవాడు. ప్రేంచంద్ ఈ కథ విని కండ్లకు నీళ్ళు వచ్చేటట్లు నవ్వినాడు.'

# IX

వ్యక్తిగతమైన సమస్యలు అనేకం ప్రేంచంద్ ఎదుర్కోవలసి వచ్చింది. ఆయన తన కూతురుకు తగిన వరుణ్ణి వెదకటం ఆరంభించినాడు. ఆ అమ్మాయి ఎక్కువగా చదువుకోలేక పోయింది. వధువు ప్రేంచంద్ కూతురు అనే యథార్థం తెలిపినా వరుని పక్షం పెద్దలు వరకట్నం గురించి సున్నితంగా ప్రస్తావించినారు. లమహీలో పెండ్లి చాలా బాగా జరిగింది.

ప్రేంచంద్ 'గబన్' అనే క్రొత్త నవల చాలాకాలం నుండి వ్రాస్తూ వచ్చి నాడు. అది 1931 సంవత్సరం ప్రారంభంలో సరస్వతీ ప్రెస్ బనారస్‌లో అచ్చైనది. ఆ నవల ప్రేంచంద్‌ను ఎప్పుడూ వేధించే ఒకానొక సమస్యను ఆధా రంగా తీసుకొని వ్రాసినది. భార్యకు సొమ్ములమీద ఉండే మమకారం భర్త జీవి తాన్ని ఏవిధంగా నాశనం చేస్తుందో ఈ నవల వివరిస్తది. ఆయన ఇంతకుముందు వ్రాసిన 'కిష్ణ' అనే నవలలోని ఇతివృత్తం కూడ అదే. ఈ యితివృత్తమే ఆయన వ్రాసిన అనేక ఇతర కథానికలలో కూడ కనుపడుతది. 'సేవాసదన్' లోని నాయిక సుమన్ ఇటువంటి బలహీనతమూలంగానే గౌరవప్రదమైన మార్గం నుండి జారిపోతది.

ప్రేంచంద్ నిగమ్‌కు ఒకజాబులో ఇట్లా వ్రాసినాడు. "నాకు వచ్చే జీతంలో గాని ఉపవేతనంలో గాని ఏమీ మిగిలించలేకపోయినాను మీరు నా పొదుపు అనండి లేదా రాబడి అనండి నా వద్ద ఉన్నవి ఒక గాజుల జత మాత్రమే అవికూడా నా భార్య ఎన్నో ఏండ్లుగా కోరుతూ వచ్చినవి ఆమె చాలాకాలంగా పెట్టుకొంటున్న మొర తీర్చటానికే ఈ పని చేసినాను. ఐనా ఈ బాధను ఇంకా నేను అధిగమించ లేదు...." 'సేవాసదన్'లో సుమన్ భర్త 'గబన్'లో జల్పాభర్త అనుభవించిన అపజయమే బహుశః కొద్ది పరిమాణంలోనైనా ప్రేంచంద్ కూడ తన తొలి జీవి తంలో అనుభవించి ఉంటాడు.

ఈ నవలలోని నాయిక జల్పా ఒక నెక్లేసు కావలెనని కోరుతది. భార్య ముందు తానొక ధనికుడైనట్లు నటించినా ఆమె భర్త కొద్ది జీతం సంపాదించే గుమాస్తా. భార్యను సంతృప్తి పరచటానికై ఆఫీసు పైకం కాజేస్తాడు. కలకత్తాకు పారిపోయి కూరగాయలు అమ్ముకొనే దంపతులవద్ద తల దాచుకొంటాడు. కల్పిత మైన ఒక బందిపోటు కేసులో సహాచారం అందించినవాడుగా పోలీసులు ఆతణ్ణి చేరుస్తారు. ఇప్పటికి ఎంతో పశ్చాత్తాపం కలిగిన భార్య కలకత్తా చేరుకొని విషాద కరమైన చిక్కులలో తగుల్కొన్న భర్తను విడిపించుకొంటది. ఇంతలో పోలీసు వాళ్ళ దౌర్జన్య పద్ధతులకు విరుద్ధంగా ప్రజలలో జాగృతి కలుగుతది. పాఠకునికి ఈ నవలలో పెద్ద ప్రజోద్యమాల వాతావరణం కనిపిస్తది. కొద్ది కొద్దిగా ఆరంభమై జాతి జీవితంలో పెద్ద తుఫానులు విజృంభిస్తవి. ఆత్యాశ, ఆన్నీ బావుకోవాలెననే తత్వం గల జల్పా ప్రజల నాయకురాలుగా పరిణమించటం ప్రేంచంద్ రచనలోని విశిష్టలక్షణం. ప్రేంచంద్ రచనలలో మానవప్రకృతిని పదేపదే ఉద్ధరించి ఉన్నతస్థితికి తీసుకరావటం మనకు కనుపడుతది.

ప్రేంచంద్ నవలారచనకు ఇది స్వర్ణయుగం. 1931 సంవత్సరారంభంలో 'గబన్' అచ్చైనది. 1931 ఏప్రిల్ 16 నాడు అయన 'కర్మభూమి' అనే మరొక గొప్ప నవల ప్రారంభించినాడు. 1932 ఆగస్టులో అది అచ్చైనది. ప్రేంచంద్ జాబుల మూలంగా ఆయన తన చివరి గొప్ప రచన 'గోదాన్' 1932లో ప్రారం భించి నట్లు తెలుస్తున్నది. కాని 'హంస' 'జాగరణ్' పత్రికలకు సంబంధించిన వివిధకష్టాల మూలంగా 1936 జూన్ వరకు అది అచ్చుపడలేకపోయింది. ఆయన చివరిసారి జబ్బుపడి ఉన్న కాలంలో వ్రాస్తుండిన నవల "మంగళసూత్ర" ఆయన అకాలమరణం మూలంగా అసంపూర్తిగా నిలిచిపోయింది. 'గబన్', 'కర్మభూమి', 'గోదాన్' ఈ నవలాత్రయం ఏ నవలాకారునికైనా గర్వకారణం.

'కర్మభూమి'లో విప్లవతీవ్రత విశిష్టంగా కనుపడుతది. ప్రజలలో అంతటా సంచలనం కనిపిస్తది. వాళ్ళను అడ్డేవారు లేరు. పట్టణాలలో పల్లెలలో కొండలలో కోనలలో సంచలనం కనిపిస్తది. వాళ్ళను అణచజాలిన శక్తిలేదు. అది తిరుగ బడిన భారతదేశం. సైమన్ కమీషన్‌ను నిరాకరించినారు. శాసనసభాభవనాల మీద బాంబులు పడేసి. భగత్‌సింగ్, చంద్రశేఖర్ ఆజాద్ వంటి వీరులు రంగం మీదికి వచ్చినారు. లాహోర్ కాంగ్రెసు అధ్యక్షోపన్యాసంలో జవాహర్‌లాల్ నెహ్రూ "నేను గణతంత్రవు సామ్యవాదిని" అని చాటినాడు ఇటువంటి సంచలనం ప్రతి

ధ్వనులు "కర్మభూమి" నిండా ఉన్నవి, గోర్కీ వ్రాసిన 'అమ్మ' వలె ఈ నవల కూడ విప్లవాలు ఎట్లా వస్తవో విపులీకరిస్తది.

ఈ నవలలో మనకు ఎందరో అద్భుత పాత్రలు-అమర్‌కాంత్, సమర్‌కాంత్, సకినా, సుఖద, పఠానీ, మున్నీ మొదలైనవారు దర్శనమిస్తారు. అమర్‌కాంత్ సమర్‌కాంత్‌లు పాఠకులకు నైరాశ్యాన్ని జ్ఞప్తికి తెస్తారు. మున్నీ, పఠానీ, సకినా, లాలా సమర్‌కాంత్‌లు పరిస్థితుల ప్రభావంతో పరిణతులైనవారు. సమాజం రక్తంతో అగ్నితో పరిశుద్ధం ఔతది.

లాలాసమర్‌కాంత్ సమ్మెచేయటానికి ప్రేరేపిస్తూ సమకాలీన దృశ్యాన్ని చిత్రిస్తాడు. "సమ్మెచేయండి. కాని ఒకనాడో రెండు నాళ్ళో కాదు. పట్టణం అధికారులు మనమాట వినే వరకూ ఈ సమ్మె సాగుతది. మనం పేదలం, దిక్కులేని వాళ్ళం. దుఃఖజీవులం. గొప్పవాళ్ళు ప్రశాంతంగా ఆలోచిస్తే ఈ పేదలే వాళ్ళను గొప్పవాళ్ళుగా చేసినారని గుర్తిస్తారు. ప్రాణాపాయంతో ఈ విశాలభవనాలు కట్టింది ఎవరు? ఈ బట్టల మిల్లులు నడిపేది ఎవరు? ప్రతినిత్యమూ వారి వాకిండ్లకు పాలు వెన్న మోసుకపోయేవాడు ఎవరు? ఈ గొప్పవాళ్ళ నాష్టాల కోసం పండ్లు మిఠాయీలు అందించేది ఎవరు? ఊడ్చేది ఎవరు? ఉతికేది ఎవరు? ప్రతి ఉదయం జాబులు వార్తా పత్రికలు అందించేది ఎవరు? పట్టణంలోని ఒక్కవంతు వారి లాభాలకోసం మూడువంతుల జనం తమ రక్తాన్ని ధారపోస్తున్నారు...."

మొత్తం నవల ఐదంకాలతో కదలే నాటకంగా భావించవచ్చు. (1) పట్టణ చిత్రణం (2) పర్వతప్రదేశాల గ్రామజీవితం (3) తిరుగుబాటు (4) కొండ గ్రామంలో ప్రజలు (5) కడపట-తిరుగుబాటు, విజయం. ఈ నవలపైన గాంధీ ప్రభావపు గాఢమైన జాడలున్నవి. అహింస గురించి పదే పదే నొక్కి చెప్పటం ఉన్నది. దానితో బాటు ఈ నవలలో ఒప్పందం తలపెట్టని విప్లవ స్వభావమూ ఉన్నది. జనం ముందడుగు వేస్తుంటారు. వాళ్ళ అదృష్టాన్ని వాళ్ళ చేతులలోనే పెట్టుకొని సాగిపోతారు. వాళ్ళ పురోగమనాన్ని నిరోధించగలవారు ఎవ్వరూ లేరు. అన్నివిధాల ప్రేంచంద్ పరిపక్వమైన విప్లవాత్మక రచన ఇది. సాంఘిక అన్యాయానికి సంపూర్ణమైన తిరుగుబాటుకు ఇది ప్రాతినిధ్యం వహిస్తది. 'గోదాన్'లోని కర్షకనాయకుని పాత్ర సాహిత్యదృష్టితో దానిని విశిష్టమైన రచనగా చేస్తది. విప్లవ స్వభావంలోకాని తీవ్రతలో కాని అది "కర్మభూమి"ని మించదు. హోరీ కి దీటు ఒక్క సూర్‌దాసే. ఐనా 'కర్మభూమి'లో అనంతమైన విప్లవమూర్తుల గణం ఉన్నది.

# X

ప్రేంచంద్ జీవితం చివరి సంవత్సరాలలో అతనికి జైనేంద్ర సన్నిహితుడైనాడు. ప్రేంచంద్ లక్నోలో అమీనుద్దౌలా పార్కు దగ్గర ఉంటున్నప్పుడు జైనేంద్ర ఆయనను మొదటిసారిగా చూచినాడు. వారి ప్రథమసమావేశాన్ని జైనేంద్ర తన స్మృతులలో ఈ విధంగా వివరించినాడు.

"తంతెలపైన నిలుచుండి క్రింద ఉన్న నావైపు చూచే ఆ వ్యక్తిని చూచి దిగ్భ్రమచెందినాను. ఆయనకు మీసాలు చాలా ఒత్తుగా ఉన్నవి. దాదాపు ఐదురూపాయల విలువచేసే లాలిమ్లీ శాలువ కప్పుకొన్నాడు. అది చాలా పాతబడ్డ శాలువ వెంట్రుకలు నొసలుమీదుగా జారి ఉండటంచేత నొసలు చిన్నగా కనుపడుతుండినది. ఉండవలసినదానికంటె తలకాయకూడ చిన్నగానే కనుపడింది. మోకాళ్ళకు కొంచెం కిందికి ధోవతి కట్టుకొన్నాడు. నిద్రమూలంగా కండ్లు భారంగా ఉండినవి. ఈతడే ప్రేంచంద్ అని గుర్తించినాను. కాని ఈతడే ప్రేంచంద్ అని గుర్తించటానికి ఆ సమయంలో నాకు కష్టమనిపించింది. నేను బ్రతికి ఉండగా ఆతణ్ణి ప్రేంచంద్‌గా గుర్తించవలసివస్తదా? కొండంత ఆశ పెట్టుకొని ఎంతో దూరంనుండి ఈ వ్యక్తినేనా చూడటానికి వచ్చింది? వాస్తవతరమూ ఆకర్షణీయమూ ఐన ప్రేంచంద్ ఆకారంలోని నా విశ్వాసాన్ని భద్రపరచుకోవటానికి ఒక్కక్షణం వెనుకకు తిరిగిపోదామనుకున్నాను. ప్రేంచంద్ పేరుతో నా యెదుట ఉన్న వ్యక్తి మామూలు చిన్న పల్లెటూరి రైతువలె కనుపడ్డాడు ... .

"ఆయన మళ్ళా అన్నాడు" రండి. వచ్చేయండి."

'ఒక చేతిలో పెట్టె పట్టుకొని నేను తంతెలు ఎక్కుతుంటే ఆయన దిగి నా చేతిలోని పెట్టెను తీసుకోవటానికి ప్రయత్నంచేసినాడు. నేను పెట్టెను తీసుకోనీయలేదు. కాని ఆయన నా చేతిలోని చిల్లర వస్తువులు ఏవో గుంజుకొని మోసుకపోయినాడు.

"ఆ యిల్లు అంత సక్రమంగా ఉండినట్లు లేదు. అనవసరంగానే నీళ్ళు ఆవరణం అంతా వ్యాపిస్తున్నవి. వస్తువులన్నీ చిందరవందరగా ఉన్నవి. ఇదంతా నాకు కనపడింది మొదటిసారి మాత్రమే. తరువాత ఇటువంటివి గమనించటానికి నా కండ్లకు తీరికే లేదు. కొద్దిసేపట్లోనే ఇది నాకు కొత్త స్థలం అనే సంగతి

ఏమాత్రం లేకుండ మరచిపోయినాను. నా విమర్శనాబుద్ధి మందగించి నిద్ర పోయింది.

"ప్రేంచంద్ అన్నీ వదిలిపెట్టి నాతో కూర్చున్నాడు. ఏడు, ఏడున్నర, ఎనిమిది గంటలైనా సంభాషణ ప్రవాహం ఆగటమే లేదు. ఈ సమయంలోనే నేను చాలా మరచిపోయినాను. హిందీ నవల సమ్రాట్టు ప్రేంచంద్ అతడని మరచి పోయినాను. నేను ఆ సాహిత్య తీరంలోనే ఆశ్చర్యచకితుణ్ణై నిలుచున్న శిశువు నని కూడా మరచిపోయినాను. కొద్దిసేపటిక్రిందనే ఆతణ్ణి చూచి నా హృదయం నిరాశతోను అనిష్టంతోను నిండిందన్న విషయంకూడ మరచిపోయినాను. అత్యంత సన్నిహితభావంతో నడచిన మా ముచ్చట్లలో అవన్నీ మరచిపోయినాను."

గాంధీగారి దండియాత్రకు సరిగ్గా పదిహేను దినాలముందు 1930 మార్చిలో ప్రేంచంద్ 'హంస' అనే కథానికల పత్రిక తీసినాడు. ఆయన నిగమ్‌కు ఇట్లా వ్రాసినాడు. "క్రొత్త సంవత్సరం అనగా ఫాల్గుణంనుండి 'హంస' అనే క్రొత్త హిందీ పత్రిక తీస్తాను. అందులో 64 పుటలు ఉంటవి. దానిలో ఎక్కువగా కథానికలకే స్థానం ఉంటది. ఇది అవివేకమే, తలనొప్పే, లాభంలేని పనే. ఐనా నేను ఏదో ఒకటి తెలివితక్కువ పని చేయాలెగదా! నా జీవితం అంతా అవివేకం తోనే నిండింది. దానికి మరికొంచెం తోడు కానీయండి."

'హంస' సంపాదకీయాలలో రాజకీయాలుండేవి. అందుకోసం తప్పని సరిగా సంకటాలు ఎదుర్కోవలసి వచ్చేది. వేయి రూపాయల ధరావతు ప్రెస్సు పక్షాన కట్టుమన్నారు. ప్రేంచంద్ ప్రెస్సూ పత్రికా రెండూ మూసివేస్తామను కొన్నాడు. విదేశపు బట్టల కొట్టుముందు పికెటింగ్ చేస్తుంటే శివరాణీదేవిని నవం బరులో అరెస్టు చేసినారు. రెండు నెలల కారాగారవాసశిక్ష విధించినారు.

ప్రేంచంద్ ఇంటిపట్టున ఉండిపోయే తత్వంగల వ్యక్తి. ఆయన జీవితం చివరి సంవత్సరాలలో ప్రయాణాలు చేయటం ప్రారంభించినాడు. దానివలన ఆయ నకు వివిధమైన అనేక అనుభవాలు కలిగినవి. ఆయన ఢిల్లీకి పోయి జైనేంద్ర వద్ద పది దినాలున్నాడు. ఆయన ఒకసారి పాట్నాకు వెళ్ళినాడు, కాని ఆహ్వాన సంఘంవాళ్ళు ఆయనను గుర్తు పట్టలేదు. రైల్వేస్టేషనులోనే రాత్రంతా గడపినాడు. వచ్చినదారినే తిరిగి పోదామని అనుకుంటుండగా అతిథేయులు వచ్చి పట్టుకున్నారు.

ప్రేంచంద్ కథానికల సంపుటం 'సమరయాత్ర' ఈ కాలంలోనే ప్రచురిత

మైనది. ఈ కథలు 1930 సంవత్సరంలో భారతదేశంలో ఉండిన సందడిని, అలజడిని, ప్రేరణను విశదంగా చిత్రిస్తవి.

నవల్‌కిశోర్ ప్రెస్ యజమాని చనిపోయిన కొద్దిదినాలకే ప్రేంచంద్‌కు ఆ ప్రెస్సుతోడి సంబంధం తెగిపోయింది. ఆ సంస్థ కోర్ట్ ఆఫ్ వార్డ్స్‌వారి అధీనం లోనికి పోయింది. ఆ ఆస్తి సంరక్షణంకోసం నియుక్తులైన అధికారులతో నెగ్గుక రావటం ప్రేంచంద్‌కు కష్టమనిపించింది. 1931 మే మధ్యలో ఆయన బనారసుకు తిరిగి పోయినాడు. ఆయన లమహీలోనే ఉంటూ ప్రతిదినం తన ప్రెస్సులో పని చేసుకోవటానికి పట్టణం వెళ్ళేవాడు.

తనకున్న బాధలు చాలక ప్రేంచంద్ వినోద్‌శంకర్‌వ్యాస్ నడపుతుండిన 'జాగరణ్' కూడ నెత్తిమీద పెట్టుకొన్నాడు; అది పక్షపత్రిక. దానికి ఇన్నూరు చందాదారులు మాత్రమే ఉండేవారు. అది వారపత్రికగా ఆగస్టు 22 నాడు ప్రేంచంద్ సంపాదకీయంతో మొదటిసారి వెలువడింది. తన ఆశయాలేమిటో ప్రేంచంద్ ఇట్లా వ్రాసినాడు.

"ఈ శిశువును నిర్భయంగా, సత్యసమ్మతంగా, కష్టబోతుగా, ఆరోగ్యంగా, ఆలోచనాత్మకంగా తనకై తాను నడిచేటట్లుగా మలచటానికి ప్రయత్నం చేస్తాము. అది ఎవరినీ పొగడదు కాని మర్యాదలను మాత్రం అతిక్రమించదు. అప్పుడప్పుడు కటువైన మాటలు వినిపిస్తది; కాని సేవాదృష్టితోనే అట్లా వినిపిస్తది ..."

'హంస' 'జాగరణ్' పత్రికలలో వచ్చిన కష్టాలమూలంగా ప్రేంచంద్ ఆర్థికంగా క్రుంగిపోయినాడు. ఆయన ఊహలు ఇప్పుడు సినిమా ప్రపంచంవైపు మరలసాగినవి. 'సేవాసదన్' ఆధారంగా తీసిన చిత్రంకోసం ఆయనకు ఏడు నూర్ల యాభై రూపాయలు ఇచ్చినారు. గుత్తా పద్ధతిపై సినిమా దృశ్యాలు వ్రాయటానికి బొంబాయికి రావలసిందిగా ఆయనను ఆహ్వానించినారు, అజంతా సినీటోన్ వారు ఆరు కథలు వ్రాయటానికి ఏడాదికి ఎనిమిదివేలు ఇస్తామన్నారు. ఈ విషయం గురించి ఆయన జైనేంద్రకు ఇట్లా వ్రాసినాడు

'ఒక ఫిల్మ్ కంపెనీవారు నన్ను బొంబాయికి రమ్మని పిలుస్తున్నారు. అది జీతం కాదు; గుత్తా పద్ధతి. ఏడాదికి ఎనిమిదివేలు. అది అంగీకరించటం తప్ప గత్యంతరం లేని పరిస్థితిలో ఉన్నాను. అక్కడికి పోవటమో లేదా నా నవల అంగడిలో అమ్ముకోవటమో చేయాలె. ఈ విషయమై మీ అభిప్రాయం తెలుసుకోవటం అవసరమని భావిస్తున్నాను. అక్కడనే హాజరుగా ఉండాలెననే నిర్బంధం

ఏమీ లేదు. నా కిష్టమున్నచోట కూర్చొని నా కిష్టమైనది వ్రాయవచ్చు. వాళ్ళకు మాత్రం ఒక ఆరు చిత్రాలకు వ్రాసిపెట్టాలె. ఒక సంవత్సరంపాటు అక్కడికి పోతేనే మంచిదనుకంటున్నాను. ఒక సంవత్సరం అక్కడున్న తరువాత వాళ్ళతో ఒక ఒప్పందానికి వచ్చి ఇక్కడ ఉంటూ కొన్ని సినేరియోలు వ్రాసి పంపుతూ నాలుగైదువేలు గడించవచ్చు. ఆ ఆధారంమీద 'హంస' 'జాగరణ్' పత్రికలు నడవ గలవు; నాకు డబ్బు ఇబ్బంది తొలగిపోతది "

ఐనా 1934 మేలో 'జాగరణ్' ప్రచురణం నిలిపివేయవలసి వచ్చింది. ఆ నెల చివరకు ప్రేంచంద్ బొంబాయి చేరుకొన్నాడు కొన్నివారాల ఎడము తర్వాత సంపూర్ణానంద్ సంపాదకత్వాన 'జాగరణ్' సామ్యవాద పత్రికగా మళ్ళా వెలువడటం ప్రారంభమైనది ఐతే అది సరస్వతీ ప్రెస్‌లోనే అచ్చై ప్రచురిత మయ్యేది.

బొంబాయిలో ప్రేంచంద్ ఒంటరితనం అనుభవించినాడు. గృహజీవనానికి అలవాటుపడ్డవాడు కనుక ప్రేంచంద్ కుటుంబాన్ని విడిచిపెట్టి వచ్చినందుకు పశ్చాత్తాప పడ్డాడు. ఆయన ఇద్దరు కొడుకులు అల్లాబాదులోని కాయస్థ పాఠశాలలో చేరినారు. బాడుగ ఇల్లు కుదరంగానే శివరాణీదేవిని బొంబాయికి పిలిపించుకుందామనుకొన్నాడు. ఆయన శివరాణీదేవికి ఇట్లా వ్రాసినాడు.

" నేను ఇక్కడికి 31 నాడు చేరుకున్నాను. ఆనాటినుండి ఒక మిత్రుని ఇంట్లో అతిథిగా ఉంటున్నాను. బాడుగకోసం చాలాయిండ్లు చూచినాను యాభై రూపాయలకు మూడు అఱ్ఱల ఇల్లొకటి ఉన్నది. డెబ్బైయైదు రూపాయలిస్తే ఐదఱ్ఱల ఇల్లున్నది. ఇంతవరకు నేను ఏయిల్లూ కుదుర్చలేదు. ఈ రెండుమూడు దినాలలో ఏదో ఒకటి ఏర్పాటు చేస్తాను. ఇక్కడ ఉంటానో ఉండనో కూడ చెప్పలేను. "

కొన్నిదినాల తరువాత ఆయన జైనేంద్రకు ఈవిధంగా వ్రాసినాడు. "నేనొక యిల్లు బాడుగకు తీసుకొన్నాను. దాదర్‌లోని ఒక హోటల్లో భోజనం చేస్తూ అక్కడ ఉంటున్నాను. ఇక్కడి ప్రపంచమే వేరు. విలువలన్నీ వేరే. ఈ జీవితం అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాను. ఈ విషయమై పుస్తకాలు చదువుతున్నాను. ఇంతవరకూ నేనేమీ వ్రాయలేదు. ధున్నాను అక్కడనే వదలి మా కుటుంబం జులైలో ఇక్కడికి వస్తది. ఎట్లనో ఒక సంవత్సరం గడుపుతాను. అటుతరువాత చూస్తాను. "

ఆయన 23 జూలై నాడు బనారసు చేరుకొని 31 నాడు మళ్ళా బొంబాయికి తిరిగి పోయినాడు. ప్రేంచంద్ 'మజ్దూర్' అనే చిత్రానికి సంభాషణలు వ్రాస్తుండేవాడు. ఫిల్ము అధిపతులే కథాశరీరం సిద్ధం చేసుకొన్నారు. ప్రేంచంద్ దానికి రక్తమాంసాలు కూర్చుతుండేవాడు. ఆ ఫిల్ము ఒక దేశభక్తుడైన మిల్లు యజమాని జీవితాన్ని చిత్రించింది. ఇదికూడా ఫిల్మ్ సెన్సార్ బోర్డ్‌వారికి రుచించలేదు. ఐనా ఆ చిత్రాన్ని పంజాబు, ఢిల్లీ, సంయుక్త పరగణాలు, మధ్య పరగణాలలో ప్రదర్శించినారు. దానితో ప్రజలలో అలజడి బయలుదేరింది. పోలీసులు కల్పించుకోవలసి వచ్చింది. తత్ఫలితంగా భారత ప్రభుత్వం ఆ చిత్రం ప్రదర్శించరాదని ఆంక్ష విధించింది.

ఈ చిత్రంలో కొన్ని క్షణాలపాటు ప్రేంచంద్ స్వయంగా తెరమీద కనుపడ్డాడు. కార్మికులకు యజమానులకు జరిగిన వివాదంలో ఆయన మధ్యవర్తిగా వ్యవహరించినాడు. ఈలోగా ఆయన సొంత ప్రెస్సు వ్యవహారాలు బాగా దిగజారి పోయినవి. పనివాళ్ళకు మూడు నెలల జీతాలు ఈయలేదు. పనివారియెడ మేనేజరు ప్రవర్తన సరిగా లేకుండెను. దానితో వాళ్ళు సమ్మె చేసినారు.

ప్రేంచంద్ తన బొంబాయి నివాసం దక్షిణదేశసంచారానికి ఉపయోగించుకొన్నాడు. ఆయనను దక్షిణ భారత హిందీ ప్రచార సమితివారు స్నాతకోపన్యాసం ఇవ్వవలసిందిగా ఆహ్వానించినారు. ఆయన డిసెంబరు 28 నాడు మద్రాసు చేరుకొన్నాడు. అక్కడ కొన్నిదినాలుండి మైసూరుకు బెంగుళూరుకు వెళ్ళినాడు.

సినిమా ప్రపంచంలో ఆయన ఉనికి దగ్గర పడసాగింది. ఆయనకు అక్కడ సంతృప్తి కలుగలేదు. కళ సమాజాన్ని ఉద్ధరించవలెనని ఆయన కోరిక, కాని ఫిల్ము యజమానులు వినోదపు విలువమీదనే శ్రద్ధవహించినారు. ప్రేంచంద్ జైనేంద్రకు ఇట్లా వ్రాసినాడు : "ఇక్కడికి నాతో తెచ్చుకొన్న కోరికలు ఏవీ ఫలించేటట్లు లేవు. ఈ నిర్మాతలు తాము అలవాటుపడిన కథనుండి ఒక్క అంగుళం కూడ కదలలేరు, అసభ్యతను వినోదపు విలువ అంటున్నారు. అద్భుతాలమీదనే వాళ్ళకు నమ్మకం. రాజులు రాణులు, వాళ్ళ మంత్రుల కుట్రలు, కల్పిత యుద్ధాలు, ముద్దులు - ఇవే వారి ప్రధాన ప్రాపకాలు. విద్యావంతులు కూడ చూడటానికి ఇష్టపడే కొన్ని సాంఘిక కథలు నేను వ్రాసినాను కాని వాళ్ళు వీటి చిత్రాలు తీయటానికి శంకిస్తున్నారు. అవి నడువకపోవచ్చు . ."

1935 ఏప్రిల్ 4 నాడు ప్రేంచంద్ సినిమా ప్రపంచపు ధూళి శాశ్వతంగా దులుపుకొన్నాడు. ఆయన ఒక స్నేహితునికి ఇట్లా వ్రాసినాడు. "నిర్ణయం తీసుకోవటం జరిగిపోయింది. నేను 25 నాడు మాయింటికి బనారసు వెళ్ళిపో తున్నాను. అజంతా తన కార్యక్రమాలు ఆపుచేస్తున్నది." తన ఒప్పందం ముగి యటానికి మూడు నెలలు ముందుగానే ఆయన బొంబాయి విడిచిపెట్టి పోయినాడు.

ఆనాటి సినిమా పరిస్థితి గురించి తీవ్రంగా విమర్శిస్తూ ప్రేంచంద్ ఒక వ్యాసంలో వ్రాసినాడు. ఆయన దాని ధ్యేయాలను సాహిత్యధ్యేయాలతో పోలుస్తాడు.

"సాహిత్యం ప్రజాభిరుచిని ఆదేశిస్తది; అనుగమినించదు. సినిమా దాన్ని అనుగమిస్తది. ప్రజాభిరుచి ఏది కోరితే సినిమా అది ఇస్తది. సాహిత్యం మన రసానుభవజ్ఞానాన్ని ప్రేరేపిస్తది. మనకు ఆనందాన్ని ప్రసాదిస్తది .సినిమా అసభ్య భావనలను ప్రేరేపి వెఱ్ఱివాళ్ళను చేస్తది దీనికి విరుగు నిర్మాతలవద్ద ఏమీ లేదు. ఒక వస్తువుకు గిరాకీ ఉన్నంతకాలం అది అంగడిలో ఉంటది. దానిని ఎవరూ ఆప లేరు. సినిమాకూ సాహిత్యానికీ సామ్యరూపం రావటానికి ఇంకా చాలాకాలం పడు తది. ప్రజాభిరుచి మెరుగై నైచ్యాన్ని తృణీకరించిననాడు సినిమాకూడ సాహిత్యంలో ఉండేటటువంటి మంచి అభిరుచిని సంపాదించుకుంటది."

# XI

బొంబాయి నివాసంవలన ప్రేంచంద్‌కు చెప్పుకోతగిన ఆర్థికలాభం ఏమీ కలుగలేదు. జైనేంద్రకు వ్రాసిన ఒక జాబులో ఆయన తనకు పోగా మిగిలిం దేమిటో తేల్చినాడు.

"బొంబాయినుండి నేను తెచ్చిందేమిటి? నాకు లభించినవి రూ. 6,300 ఇందులో నా కొడుకులు రూ. 1,500 తీసుకొన్నారు. రూ. 400 బిడ్డ తీసుకొన్నది రూ 500 ప్రెస్సుకు పోయినవి. ఎంత పొదుపరితనం చేసినా బొంబాయిలో పది నెలలకు రూ 2,500-00కు తక్కువ వ్యయం కాలేదు, నేను అక్కడనుంచి తెచ్చు కొన్నవి రూ 1,400-00 ఇంకా పరాజయం మాత్రమే.

'జాగరణ్' ఎంతో డబ్బు తిని తిని నిద్రపోయింది. 'హంస' ఊగిసలాడ టం మొదలుపెట్టింది. ప్రేంచంద్ ప్రెస్సును 'హంస'ను అల్లాబద్‌కు తీసుకపోవా

లేననుకున్నాడు కాని ఆయన ఊహలు ఫలించ లేదు. చిట్టి చివరకు 'హంస'ను భారతీయ సాహిత్య పరిషత్తుకు అప్పగించి ప్రేంచంద్ కె ఎం. మున్షీకి సహ సంపాదకుడైనాడు. ఇన్ని యత్నాలు చేసినా ఆర్థిక సమస్య తీరనేలేదు.

జీవితం చివరి దినాలలో ప్రేంచంద్ భారతదేశంలోని దూర దూర ప్రదేశాలు పర్యటించినాడు. ఆయనలోని శక్తి హఠాత్తుగా ప్రజ్వలించినట్లు కనుపించింది. అదే చివరి వెలుగు. వచ్చిన ఆహ్వానాలన్నీ స్వీకరించి అన్ని చోట్లకు - అల్హాబాద్, బిహార్‌లోని పూర్ణియా, లక్నో, ఢిల్లీ, లాహోరులకు పోయినాడు మహాప్రస్థానానికి ముందు ఆయన తన దేశాన్ని వీలైనంత చూడాలెనను కొన్నట్లున్నాడు. హిందుస్తానీ అకాడమీవారి సమావేశంలో పాల్గొనటానికి ఆయన అల్హాబాద్ వెళ్ళినాడు. అక్కడ ఆయన కొందరు ప్రఖ్యాత అభ్యుదయ రచయితలను కలుసుకొని వారిని దీవించినాడు. హిందీ, ఉర్దూ రచయితలను సన్నిహితం చేయటానికి ఒక హిందుస్తానీ సభ నెలకొల్పాలెనని కూడ కాంక్షించినాడు. జైనేంద్ర సహాయాధారాలతో ఈ సంస్థ శాఖలు ఢిల్లీ లాహోర్లలో నెలకొల్పినాడు అభ్యుదయ రచయితల మహాసభ ప్రథమ సమావేశానికి అధ్యక్ష్యం వహించటానికి అక్కడినుండి ప్రేంచంద్ లక్నో వచ్చినాడు. సభలు 1936 ఏప్రిల్ 9, 10 తేదీలలో జరిగినవి. 1936 జనవరిలో ఇంతకు పూర్వమే ప్రేంచంద్ ఇటువంటి ఉద్యమాన్ని ఆహ్వానించినాడు. ఆయన ఈవిధంగా వ్రాసినాడు. "విద్యావంతులూ ఆలోచనాపరులూ ఐన యువకులు సాహిత్యంలో ఒక క్రొత్త శక్తిని చైతన్యాన్ని తీసుకరావటానికి కాంక్షిస్తున్నారని తెలుసుకోవటానికి మేము చాలా సంతోషిస్తున్నాము. ఈ ఉద్దేశాన్ని దృష్టిలో పెట్టుకొనే భారతీయ అభ్యుదయరచయితల సంఘం లండన్‌లో స్థాపితమైనది. వాళ్ళు పంపిన మానిఫెస్టో మార్గంలో ఈసంస్థ పయనించినట్లైతే మన సాహిత్యంలో ఒక క్రొత్త యుగం పుట్టే ఆశలు రేకెత్తుతున్నవి."

అభ్యుదయ రచయితల సంఘం అధ్యక్షోపన్యాసంలో ప్రేంచంద్ ఈవిధంగా ఉద్ఘాటించినాడు. "ఇతర విషయాలవలె కళను కూడా ప్రయోజనం అనే త్రాసులో తూచటానికి నేను వెనుకాడను. మనం మన సౌందర్యప్రమాణం మార్చుకోక తప్పదు. ..... కళకు రూపోపాసన అనే సంకుచితార్థం నాడూ నేడూ ఉన్నది . అది యింకా జీవితసంఘర్షణలో పరమసౌందర్యాన్ని దర్శించేదిగా వృద్ధిపొంద లేదు ...

"సాహిత్యమందిరంలో ఐశ్వర్యాన్ని ప్రేమించేవారికి స్థానంలేదు. సేవయే జీవితంలో ప్రధానమైనదిగా భావించే భక్తులే ఇక్కడ అవసరం. హృదయం బాధపడేవాళ్ళు. ప్రేమ ప్రసాదించే శక్తిగలవాళ్ళే ఇక్కడ అవసరం..."

ఆయన ఇంకా "సమాజ పతాకాన్ని ఎత్తి పట్టుకున్న సైనికులం మనం" అని చాటినాడు.

ప్రేంచంద్ లక్నోనుండి లాహోర్ వెళ్ళినాడు. ఆయనకు ఆర్యప్రతినిధి సభవారు అక్కడ ఘనమైన స్వాగతం ఏర్పాటు చేసినారు. ఆయన చాలా సమావేశాలలో పాల్గొన్నాడు మాట్లాడిన ప్రతిచోట హిందీ ఉర్దూలను సన్నిహితం చేయవలసిన అవసరంగురించి నొక్కి చెప్పినాడు. లాహోరునుండి ఆయన భారతీయ సాహిత్య పరిషత్సమావేశంలో పాల్గొనటానికి నాగ్పూర్ వెళ్ళినాడు. ఆ సమావేశంలో గాంధీ నెహ్రూలు కూడ పాల్గొన్నారు. పరిషత్తు కార్యకలాపాలకు ఆనాటి సమావేశం కార్యకలాపాలకు హిందీ ఉర్దూ భాషలలో ఏది మాధ్యమంగా ఉండాలెననే తీవ్రమైన ఘర్షణ ఏర్పడింది. గాంధీగారు హిందీ - హిందుస్తానీని సూచించి నందుకు మౌలానా అబ్దుల్‌హఖ్ కోపంతో పరిషత్సమావేశం విడిచి వెళ్ళి పోయినాడు.

బొంబాయినుండి తిరిగి వచ్చిన తరువాత ప్రేంచంద్ "గోదాన్" వ్రాయటంలోనే నిమగ్నుడైనాడు. అది పూర్తి ఐనతరువాతనే లమహీనుండి కదలినాడు సభలు, సమావేశాలు, పర్యటనలు, అటు ఇటు తిరుగటం - ఈవిధంగా మనస్సును ఇతరత్ర లాగేవి ఎన్నో ఉండేవి. ఐనా 1936 మే చివర ప్రాంతాన ఆ నవల ప్రెస్సునుండి వెలువడింది.

'గోదాన్' ప్రేంచంద్ కృతులలో సర్వోత్కృష్ట శిఖరం. ఈ పరాంకోటిని అందుకోవటానికే ఆయన రచనలన్నీ మొగ్గు చూపినవి. భూస్వామ్య, పారిశ్రామిక నియంతృత్వాలు రెండింటిలోను ఉన్న చెడుగులను ఆయన ఈ నవలలో విమర్శించినాడు. ఇటు పొలంలోను అటు కర్మాగారంలోను చెమటోడ్చేవాడు అత్యంత తీవ్ర వేదనలకు గురి ఔతున్నాడు. భారతదేశ దుఃఖాలను హోరీ పాత్రమూలంగా ప్రేంచంద్ 'గోదాన్'లో సంకేతించినాడు. హోరీయే భారతదేశం. శతాబ్దాల తరబడిగా క్రూరంగా నలిగిపోతూ కూడ అది తన ఏకత్వాన్ని, విశాలదృష్టిని, హృదయాన్ని కాపాడుకొంటున్నది. గోబర్, ధనియా, ఝునియా, మెహ్తా, మాలతీ మొదలైన ఇతర పెద్ద పాత్రలు కూడ ఈ నవలలో ఉన్నవి. ఈ పాత్రలలో

పెద్ద యెత్తున దోపిడిసాగిపోయే పల్లెటూళ్ళవి కొన్ని, పట్టణాలవి మరికొన్ని. వాళ్ళు చెడును అన్యాయాన్ని ఎదిరిస్తూ, ప్రపంచాన్ని మార్చటానికి యత్నిస్తూ, ఆ పద్ధతిలో తామూ మారుతూ ఉదారులుగా విప్లవవీరులుగా మారుతుంటారు.

భారతదేశపు నవలాసాహిత్య చరిత్రలో 'గోదాన్' ఒకమైలు రాయి. భారతదేశంలోని ఏ రచయితకూడ గ్రామీణ జీవితాన్ని చిత్రించే కళలో ఇంత ప్రావీణ్యం కనుపరచలేదు. దానిది ఇతిహాస పరిమాణం గల పటావరణం. అందులోని పాత్రలు సాధారణులైన గ్రామీణులైనా మన కండ్ల యెదుట ఐతిహాసిక పాత్రల గాంభీర్యం ప్రదర్శిస్తారు. ప్రేంచంద్ తన రచనకు సామ్యవాదభంగిని కలిగించి మనకు దోపిడీ దుఃఖాలులేని ప్రపంచదృశ్యాన్ని చూపిస్తాడు. హోరీ ఇటువంటి ప్రపంచాన్ని రూపొందించటానికోసం పోరాడుతూ నవల చివరన కన్ను మూస్తాడు.

'గోదాన్' మూడేండ్ల పరిశ్రమ ఫలితం. ప్రేంచంద్ 1932లో దానిని ప్రారంభించినాడు. ఈ కాలంలో ఆయన వివిధ కథానికలు, వ్యాసాలు, సంపాదకీయాలుకూడ వ్రాసినాడు. సభలూ సమావేశాలలో పాల్గొంటూ, ఎడతెగని ప్రయాణాలు చేస్తూ ఆయన జీవితం మరోవిధంగా సందడిగానే సాగుతూ వచ్చింది. ఇప్పటికి ఆయన ఆరోగ్యం బొత్తిగా చెడిపోయింది .మహోబాలో ఉన్ననాటినుండి ఆయన అతిసారదీర్ఘ రోగంతో బాధపడుతుండేవాడు. ఇప్పుడు అయన అంత్రవ్రణాలు జలోదరంతో మంచం పట్టినాడు.

ఆయన జూన్ 16 నాడు చాలాసార్లు వాంతి చేసుకొన్నాడు. నెత్తురు విరేచనాలైనవి. తీవ్రమైన కడుపు నొప్పి లేచింది. ఈ రుగ్మతనుండి ఆయన తేరుకోనే లేదు. జూన్ 19 నాడు 'ఆజ్' కార్యాలయంలో గోర్కి మరణసందర్భంగా సంతాపసభ జరిగింది. అంత జబ్బుతో ఉన్నా ప్రేంచంద్ ఆ సభకు వెళ్ళినాడు. అందుకోసం ఒక ప్రత్యేక ఉపన్యాసం వ్రాసినాడు. శివరాణీదేవి రాత్రి రెండు గంటలకు ఎందుకో మేల్కొని చూస్తే ఆయన ఈ ఉపన్యాసం వ్రాస్తున్నది చూచింది. అందుకు ఆమె ఆక్షేపిస్తే "నేను ఏమి చేయను? నేను నిద్ర పోలేను. ఈ ఉపన్యాసంకూడ వ్రాయవలసిందే" అన్నాడు. సభ జరుగుతున్నప్పుడు ఆయన మరీ నీరసించిపోయి ఆ ఉపన్యాసం చదువలేకపోయినాడు. దానిని మరెవరో చదివినారు.

25 నాడు రాత్రి ఆయన పరిస్థితి విషమించింది. వేడిగా ఉన్నదని కొడుకును విసరుమన్నాడు. నెత్తురు వాంతి చేసుకొన్నాడు. శివరాణీదేవి ఉరికివచ్చింది.

"రాణీ! నేను వెళ్ళిపోతున్నాను" అన్నాడు 25 నాటి తరువాత ఆయనకు మంచి నిద్ర పట్టనేలేదు. ఇతరమైన రుగ్మతలు కూడ చేరి మరీ విషమింపచేసినవి. ఈ విధంగా ఉంటూ కూడ ప్రేంచంద్ "మంగళసూత్ర" అనే క్రొత్త నవలకోసం పరిశ్రమించేవాడు. అది అసమగ్రంగానే మిగిలిపోయింది.

ప్రేంచంద్ ఆగస్టు 2 నాడు పెద్దకొడుకును వెంటబెట్టుకొని ఎక్స్‌రే పరీక్ష చేయించుకోవటానికి లక్నో వెళ్ళినాడు. కొద్దిదినాలకుముందే ప్రేంచంద్ తన పరిస్థితిగురించి అఖ్తర్‌హుసేన్ రాయ్‌పూరీకి ఇట్లా వ్రాసినాడు. "నేను నెలనాళ్ళనుండి జబ్బుతో ఉన్నాను. ఆంత్రవ్రణాలతో బాధపడుతున్నాను. నెత్తురు వాంతు లౌతున్నవి. కనుక ఏపనీ చేయలేను. ఔషధం సేవిస్తున్నాను కాని ఇంతవరకు గుణం కనుపడ లేదు. నేను గనుక బ్రతికితే తప్పకుండా మన అభిప్రాయాలు ప్రకటించే "బీస్వీం శతాబ్దీ" (ఇరువయ్యో శతాబ్దం) అనే పత్రిక తీస్తాను."

లక్నో చికిత్సవలన ఏమీ లాభం కలుగలేదు. ప్రేంచంద్ బనారసుకు తిరిగిపోవ నిశ్చయించుకొన్నాడు. ఆయన పట్టిఎముకలగూడై పోయినాడు. శివ రాణీదేవితో "ఇకనేను బ్రతుకను, ఇది జలోదరం అన్నాడు."

ప్రేంచంద్ రాంకటోరాలో గాలి బాగా వచ్చే క్రొత్తయింటికి మారినాడు. ఒకప్పుడు అది భారతేందుహరిశ్చంద్రకు ఆరామగృహం. ఈ చివరదినాలలో ఎందరో సాహిత్య మిత్రులు ప్రేమతో ప్రేంచంద్ చుట్టూ ఉండేవారు. జైనేంద్ర చివరి నిమిషందాక ఉన్నాడు. కాన్పూర్‌నుండి మున్షీదయానారాయణ్ నిగమ్ పరుగెత్తుకొని వచ్చినాడు. ప్రేంచంద్‌ను చూడవచ్చినవారిలో 'ప్రసాద్' నంద్ దులారే వాజపేయీ, పండిత్ రాంనరేశ్ త్రిపాఠీ, 'నిరాలా' మొదలైనవారున్నారు.

ప్రేంచంద్ చివరి దినాలలో 'హంస' పత్రికకోసం వేయి రూపాయలు ధరావతు కట్టాలెనని ఆదేశం వచ్చింది. ప్రభుత్వంవారు సేఠ్ గోవింద్‌దాస్ వ్రాసిన ఒక నాటకానికి ఆక్షేపణ తెలిపినారు. భారతీయ పరిషత్తు ఆ పత్రికను ఆపటానికి నిర్ణయించింది. ప్రేంచంద్ సంతకంతో ఆ విషయమై ఒక ప్రకటనకూడ చేసింది. ప్రేంచంద్ ఈ విషయమై గాంధీగారికి వ్రాసినాడు. ప్రేంచంద్‌కు ఇష్టం ఉంటే ఆతడే 'హంస'ను ప్రచురించుకోవచ్చునని గాంధీగారు అన్నారు. ప్రేంచంద్ ఆ పత్రికాభారం తీసుకొన్నాడు. ధరావతు కట్టినాడు, ఆయనశివరాణీ దేవితో ఇట్లా అన్నాడు:

"రాణీ! దయచేసి ఆ ధరావతు కట్టు. నేను బ్రతికినా బ్రతుకకపోయినా

హంస' మాత్రం కొనసాగాలె. నేను బ్రతికితే కావలసిన ఏర్పాట్లన్నీ చేస్తాను. నేనుపోతే అది నాకొక స్మృతి చిహ్నం ఔతది.''

'హంస' సెప్టెంబరు సంచికలో 'మహాజనీ సభ్యతా' అనే ప్రేంచంద్ వ్యాసం ఉన్నది. అదే ఆయన చివరి సాహిత్య మరణశాసనం - వీలునామాగా భావించవచ్చును.

ప్రేంచంద్ ఈ భూమిమీద గడపిన శివరిరాత్రి - అక్టోబరు ఏడవనాటి రాత్రిని జైనేంద్ర ఈవిధంగా వర్ణించినాడు: 'ఆయన మరణించటానికి పూర్వపు రాత్రి నేను ఆయన పడక దగ్గరనే ఉన్నాను. ఆయన మరునాడు ఉదయం 7 గంటలకు కన్నుమూయనున్నాడు. ఆ ఉదయం తెల్లవారుజామున మూడుగంటలప్పుడు నాతో మాట్లాడినాడు. చుట్టూ నిశ్శబ్దం ఆవరించింది ఆ చిన్న అట్ట చీకటితో నిండింది. అందరూ నిద్రపోయినారు. ఆయన పెదవులవెంట మాటలు అస్పష్టంగా వచ్చి మాయమైపోయేవి. ఆయన మాటలు హృదయానికే కాని చెవులకు వినపడేవి కావు. ఆయన తన కుడిచేతిని నాముందుకు సాచి దానిని 'నొక్కు' అన్నాడు. ఆచేయి వాచింది, పూర్తిగా తెల్లబడిపోయింది. నేను ఆచేయి పట్టుకొని రాచినాను.

'ఆయన మాట్లాడలేదు. కండ్లు మూసుకొని పడిఉన్నాడు. అర్ధరాత్రి కావటంతో 'హంస' గురించి మాట్లాడటం ఆపివేసినాడు. ఆయన తన కోరికలు ఆకాంక్షలు అప్పుడు కొన్ని మాటలతోను కొన్ని కన్నులతోను నాకు తెలియపరచినాడు. అప్పుడుకూడా ఆయన 'హంస' పరిస్థితులగురించి సాహిత్య పరిస్థితిగురించే బాధపడుతున్నాడు. ఆయన తన పిల్లల భవిష్యత్తు గురించికూడ బాధపడుతున్నాడు. నా మూలంగా ఆయనకు కొంత దుఃఖోపశమనం కలిగింది

'తెల్లవారు జామున మూడు గంటలకు ఆతని వాచి పోయినచేతిని పట్టుకొని నామీద ఆయన ఈవిధంగా ఆధారపడటం న్యాయమేనా అని ఆశ్చర్యపడసాగినాను. మధ్యరాత్రి ఆవిషయమై ఆయనతో అధిక ప్రసంగంగా వాదించినాను కూడ. అదే ఇప్పుడు నాలో మెరమెరలాడు తుండినది. నేనే మనను? నేను చేయగలిగినది ఏమిటి?

'ఇంతలో ఆయన ''జైనేంద్ర!'' అని పిల్చినాడు'

'ఆవిధంగా పిల్చి నన్ను ఊరక చూడసాగినాడు. నారెండు చేతులతో ఆయన చేతిని పిసికినాను. ఆయనను చూస్తూ ''బాబూజీ! బాధపడకండి. మీరు ఇప్పుడు తేరుకొంటున్నారు. అన్నింటికి మేము సిద్ధంగా ఉన్నాము'' అన్నాను.

'ఆయన నా వైపు అట్లనే చూస్తూ "ఆదర్శవాదంవలన ఏమీ లాభం లేదు" అన్నాడు.

"ఆదర్శవాదం..." అందామనుకున్నాను.

'కాని ఆయన నన్ను అడ్డగించి "వాదించకు" అన్నాడు. ప్రక్కకు తిరిగి కండ్లు మూసుకొన్నాడు.

'కొంత సేపటికి "బాగా వేడిగా ఉన్నది. విసురు" అన్నాడు.

నేను విసరటం మొదలు పెట్టినాను. ఆయనకు నిద్ర పట్టలేదు. తీవ్రమైన నొప్పితో బాధపడుతున్నాడు. ఐనా మూర్ఛ టం లేదు. కండ్లు తెరచి పడి ఉన్నాడు.

'కొన్ని నిమిషాల తరువాత "జైనేంద్ర! వెళ్ళి పడుకో" అన్నాడు.

'ఈ భూమి మీద ఆయన ఇక కొద్ది నిమిషాలే ఉంటాడని నాకేం తెలుసు. నేను పడుకోవటానికి పోయినాను.

'తెల్లవారేవరకు ఆయనకు అపస్మారం కలిగించే సొమ్మ వచ్చింది. దాని నుండి ఆయన తేరుకోనే లేదు.'

1936 అక్టోబరు 8 నాడు ఉదయం 7-30 గంటల సమయాన ప్రేంచంద్ కన్నుమూసినాడు.

రోగాలతో చితికిపోయి, దారిద్ర్యకమైన ఇబ్బందులతో సతమతమై, మానవుని విశ్వాసాన్ని కించపరిచి అవమానించే జీవితానికి ప్రతిగా ఎడతెగకుండా పోరాడుతూ ప్రేంచంద్ తన 56 ఏట అకాలమృత్యువు వాతపడ్డాడు. మంచి బ్రతుకుకోసం స్వతంత్ర భారతం కోసం పోరాడుతూ ప్రేంచంద్ మరణించినాడు. ఆయన శక్తులు ఉచ్చదశలో ఉన్నప్పుడే ఆయన చనిపోయినాడు. 'మహాజనీ సభ్యతా' 'మంగళ సూత్ర' వంటి శక్తివంతమూ మనోహరమూ ఐన రచనలు ప్రారంభించి పోయి నాడు. చివరి నిమిషందాకా తాను ఎత్తిన ధ్వజం ఉన్నతంగానే ఉంచినాడు. ఒక్క క్షణమైనా దానిని వంగనీయలేదు. ఆతడు ఎల్లవేళలా యోధుడే కవచధారిగానే యుద్ధరంగంలో కన్నుమూసినాడు. ఆయన వారసులు స్మరిస్తూ కాపాడుకోవటానికి గర్వించదగిన వారసత్వాన్ని ఇచ్చిపోయినాడు. గర్వించదగిన ఆ వారసత్వానికి మన మంతా వారసులం.

# XII

ప్రేంచంద్ రంగంమీదికి వచ్చేనాటికి హిందీ నవలాసాహిత్యం బాల్య దశలో ఉండేది. 'చంద్రకాంత సంతతి' లేదా 'భూతనాథ్' లో ఉన్నటువంటి అద్భుతమైన సంఘటనలే ఆనాటి కథలలో ఉండేవి. ఈ ధోరణికి వైవిధ్యం కూర్చినవాడు మితిమీరిన నేరపరిశోధకశక్తులు గల బ్లేక్ అనే అపరాధ పరిశోధకుడు. అడపదడప వెలువడిన 'పరీక్షాగురు' వంటి సాంఘిక నవలల్లో చెప్పుకోతగిన సాహిత్య విలువ లేకుండె. అవి ప్రధానంగా చారిత్రకాలు.

ప్రేంచంద్ కృషితో హిందీ నవలాసాహిత్యం సంపూర్ణంగా వికసించి పరిపక్వమైనది. హిందీ నవలాసాహిత్యానికి ప్రేంచంద్ ఒక క్రొత్త సామాజిక జాగృతిని, క్రొత్త ధ్యేయాన్ని ప్రసాదించినాడు. ఆయన చేతుల్లో హిందీ నవల జీవితానికి చాలా సన్నిహితంగా వచ్చింది, వాస్తవాన్ని యథాతథంగా ప్రతిబింబించింది. ప్రేంచంద్ ఆదర్శవాది. కలలు కన్నట్లుగా ఆయన జీవితాన్ని మలచదలచినాడు. ఐనా జీవితంలోని కఠోరమూ వికారమూ ఐన సత్యాలయెడ ఆయన కండ్లు మూసుకోలేదు. ఆయన దేనిని తగ్గించలేదు ; దేనిని క్షమించనూ లేదు ; ఆయన రచనలు పాఠకుణ్ణి సమున్నతస్థితికి తీసుకపోతవి. ఆయన నిజమైన ప్రజారచయిత. ఆయన ప్రజాజీవితం గురించి వారికి తెలిసే భాషలో వ్రాసినాడు. ఆయన సందేశం పరిమితమైన మేధావివర్గం పరిధిని దాటి సుదూరం పోతది. ప్రజలలో కొద్దిపాటి చదువుకొన్నవాళ్ళుకూడ ఆయన గ్రంథాలు చదివేవారున్నారు. ఈ విషయంలో ఆయన భారతదేశపు ప్రజాసముదాయాన్ని తమ మాటలతో మంత్రముగ్ధులను చేసే తులసీదాస్ కబీరువంటి మధ్యకాలపు కవులను తలపిస్తాడు.

పరమోత్కృష్ట సాహిత్యపు విలువలున్న నవలలు ఆయన దాదాపు పన్నెండు వ్రాసినాడు. సేవాసదన్, ప్రేమాశ్రమం, రంగభూమి, కాయకల్ప, వరదాన్, నిర్మల, ప్రతిజ్ఞ, గబన్, కర్మభూమి, గోదాన్ మొదలైనవి అట్టి నవలలు. ఆయన ఇన్నూటయాభైవరకు కథలు వ్రాసినాడు. అందులో కొన్ని ప్రపంచసాహిత్యంలోనే అత్యుత్తమమైనవిగా ఎన్నదగినవి. ప్రేంచంద్ కుమారుడు అమృతరాయ్ వ్రాసిన 'కలం కా సిపాహీ' గ్రంథంలో అనుబంధంగా 224 కథల పట్టిక ఇచ్చినాడు. సృజనాత్మకరచనలలో వీని బాహుళ్యమే మనల ఆశ్చర్య చకితుల చేస్తది. దాని గుణం అంతకంటె ఎక్కువ ఆశ్చర్యాన్ని కలిగిస్తది.

ప్రేమ్‌చంద్‌కు ఇష్టమైన ఇతి వృత్తాలు ఏమిటో మనం వరుసగా చెప్పుకో వచ్చు. ఆయన రచనల్లో అవి పునరావృత్తం ఔతుంటవి.

1. సొమ్ములు, ఆడంబరం పైది ప్రేమ, వాటివలన కలిగే కష్టాలు దుఃఖాలు
2. కర్షకుల కష్టగాథలు, బాధలు.
3. మతకల్లోలాలు, సనాతనాచారపరాయణత్వం, నమ్మకాలు, గ్రుడ్డి పక్షపాతాలు.
4. వరకట్నం, వివాహవిధానం.
5. హిందూ వితంతువుల దుర్గతి.
6. సవతి తల్లి.
7. సాంఘికోద్యమాలు. జాతీయ విప్లవం.
8. చరిత్రాభిరుచి: మధ్యయుగ చరిత్ర, ఆధునిక భారతీయ చరిత్ర.
9. అతాకికాభిరుచులు.
10. దేశభక్తిపూర్వక ఇతివృత్తాలు.
11. బలిగుడు, చిల్లగోనె వంటి ఆటలు.
12. నటన వంచనలను బహిరంగ పరచటం, వేళాకోళం చేయటం.
13. సాంఘిక అన్యాయాలు గల ఇతివృత్తాలు.
14. సాంఘిక వాస్తవాల ప్రభావంతో శీలంలో మార్పు రావటం, సజీవపాత్ర చిత్రణం చేసే కథలు.

ప్రేమ్‌చంద్ హిందీలో సామాజిక రాజకీయనవలను సృష్టించినాడు శరచ్చంద్రుడు, టాగోర్ రచించిన నవలల్లోకంటె ప్రేమ్‌చంద్ నవలల్లో రాజకీయాల ప్రభావం ఎక్కువగా ఉంటవి. బెంగాలీ నవలా సాహిత్యంలో స్త్రీత్వగుణం ఉన్న దని ప్రేమ్‌చంద్ ఆరోపించినాడు. ప్రేమ్‌చంద్‌తో జరిగిన సంభాషణను జైనేంద్ర ఈ విధంగా వ్రాసిపెట్టినాడు.

'నేనన్నాను—బెంగాలీ సాహిత్యం హృదయానికి ఎక్కువగా హత్తుకొం టది. ఇది మీరు ఒప్పుకొంటారా? దీనికి కారణం ఏమిటి? ' ప్రేమ్‌చంద్ సమా ధానంగా అన్నాడు—నేను తప్పకుండా ఒప్పుకొంటాను. కారణం ఏమంటే అందులో స్త్రీత్వ మార్దవం హెచ్చుగా ఉన్నది. నాలో ఇది చాలినంతగా లేదు.

'అది విని నేను మళ్ళా ప్రారంభించినాను—స్త్రీత్వగుణం ఉండబట్టే అది హృదయాన్ని ఎక్కువగా కదలిస్తున్నదా? అని అడిగినాను.

'ఆయేన—ఔను అన్నాడు. అవి తరచుగా స్మృతిగతమైపోతది. మేధలో భావనామార్దవం ఉంటది; నిశ్చయంలో భావనా కారిన్యం ఉంటది. సృజనాత్మకతకు ఈ రెండూ అవసరమే.

'ఆయన ఇంకా సాగించినాడు—జైనేంద్ర! నాకు స్పష్టంగా తెలువదు. నేను బెంగాలీని కాను. వాళ్ళ ఉద్రేక స్వభావులు. ఉద్రేకాలు లాగుకపోయే చోటికి నేను పోలేను. నేను అంతగా ఈయలేను. విజ్ఞానం తీసుకపోలేని చోటికి కూడా ఉద్రేకాలమూలంగా పోవచ్చు. కాని జైనేంద్ర! మనకు కారిన్యంకూడ అవసరమని నే ననుకొంటాను.

'ఈ విధంగా అంటూ ప్రేంచంద్ ఆడపిల్లవలె సిగ్గుపడ్డాడు ... ...ఆయన అన్నాడు—జైనేంద! రవీంద్రుడు శరచ్చంద్రుడు చాలా గొప్పవాళ్ళు. కాని హిందీకి కూడ అదే మార్గమా? కనీసం నా మార్గం మాత్రం అదికాదు.'

ప్రేంచంద్ పరిశీలనలో కవిత్వం లేదు. వసంతం రాకతో పల్లెపట్టులు ఎట్లా మారుతవో ఆతడు తప్పక గమనించినాడు. నెగడు చుట్టూ కూర్చొని తమ సామూహికదుఃఖాలు చెప్పుకొనే గ్రామీణాకృతుల సౌందర్యం చూచినాడు. గొప్ప మానవీయ సంబంధాల అందాన్ని ఆయన గ్రహించినాడు. కాని ఆయన ప్రధానంగా నిమగ్నమైనది మంచిచెడుగుల ప్రశ్నల్లో, సామాజిక న్యాయంలో, స్వాతంత్ర్యంలో. ఆయనలో మెత్తదనమూ సాధుత్వమూ ఉండినవి కాని ఆయన రచనలు మాత్రం చాలావరకు సంఘంలోని దౌర్జన్యంపై ప్రయుక్తమైన తీవ్రబాణాలు.

ప్రేంచంద్ ఉద్రేకపరిచే మంచి కథలు చెప్పినాడు. కేవలం కథలో ఉన్న రుచిమూలంగానే ఆయన నవలలు పాఠకుణ్ణి మంత్రముగ్ధంగా ఆకట్టుకొంటవి. కాని 'తిలిస్మె హోష్రుబా' వంటి గ్రంథపఠనం మూలంగా ఆయన మనస్సుమీద పడిన ప్రభావం ఆయన నవలా సాహిత్యానికి స్ఫూర్తినీ నాటకీయతనూ కలిగించిందని ఒప్పుకొని తీరాలె. ఈ ప్రపంచంలో ఏవేవో జరుగుతుంటవి. చావులు, ఆత్మహత్యలు, కలయికలు ఉంటవి. 'రంగభూమి'లో సోఫీని తిరుగుబాటుదారులు పట్టుకొని నిర్బంధంలో ఉంచుతారు. అందులో తుపాకీ యుద్ధాలు గగుర్పాటు కలిగించే సంఘటనలు ఉన్నవి. చివరకు సోఫీ వినయ్‌ల కలయిక ఒక రైల్వే స్టేషన్‌లో ఆశ్చర్యజనకంగా జరుగుతది. 'కాయకల్ప'లో ఒక రాణి రైడర్ హాగర్డ్ 'షి' వలె ఎప్పుడూ యౌవనవతిగా అందగత్తెగా ఉంటది.

స్నిగ్ధమూ నిశితమూ ఐన వ్యంగ్యచిత్రణంలోకూడ ప్రేంచంద్ సిద్ధహస్తుడు. ఆయన తన వర్ణనాబలంలో తానే కొట్టుకపోయి సంయమనాన్ని మితభాషిత్వాన్ని నిర్లక్ష్యం చేస్తాడు. 'కాయకల్ప'లో మనోరమ మున్షీవజ్రధర్ ఇంటికి వెళ్ళినప్పుడు చోద్యమైన సంగతులు జరుగుతవి. మున్షీవజ్రధర్ మహోద్రేకంలో గంతులు వేస్తాడు, పడిపోతాడు, దీపం అరిపోతది, ఇల్లు చిమ్మచీకటైపోతది.

ఆధునిక నవలలో సన్నివేశాలు ద్రుతగతితో సాగవు. కథాప్రగతి తక్కువగా ఉంటది. ఒకడు భోజనం చేస్తాడు. వాహ్యాళికి పోతాడు, వచ్చిపోయే జనాన్ని చూస్తాడు, దీర్ఘంగా ఆలోచిస్తాడు. భారతీయసమాజం ఇంకా అన్నివిధాలా వెనుకపడి ఉన్నది. ఇక్కడి సన్నివేశాలు ద్రుతగతితో నాటకంవలె సాగిపోతవి. నాగరక సమాజాలలో ఇది ఇంకా మందంగా సాగుతది. అక్కడ ఒక చుట్ట సువాసనో పానీయపు గుబాళింపో కావలసినంత ఉద్రేకాన్ని కలిగిస్తవి.

రచయితగా ప్రేంచంద్ గొప్పతనం అంతా ఆయన సృజనాత్మకప్రజ్ఞలో దీపిస్తది. ఆయన జీవితాన్ని సమగ్రంగా సృష్టించినాడు తన సొంత కల్పనతో ఒక ప్రపంచమే నెలకొల్పినాడు. ప్రేంచంద్ ప్రపంచంలో మూర్లకొలది జనం—రైతులు, భూస్వాములు, వడ్డీ వ్యాపారులు, పారిశ్రామికులు, సాహసికులు, సత్యం కోసం న్యాయంకోసం పోరాడేవాళ్ళు, పోతపోసిన ఉదారవీరులు, మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు, సాధుస్వభావంగల అమ్మాయిలు, గయ్యాళి ముసలివాళ్ళు నివసిస్తారు. సాహిత్య చరిత్రలో అత్యున్నత మూర్తులైన - సుమన్, ప్రేంశంకర్, సూర్‌దాస్, సమర్‌కాంత్, హోరీ, సోఫీ ఇంకా ఎందరో ఉన్నారు. ఈ పాత్రలు మన వ్యక్తిగత స్నేహితులు ; చాలామంది బ్రతికి ఉన్నవాళ్ళకంటె వాస్తవంగా తోచేవారు.

ఈ విధంగా ప్రేంచంద్ తన రచనలద్వారా భారతదేశాన్ని చిత్రిస్తాడు. ఆజనం అన్యాయానికి ప్రతిగా న్యాయంకోసం పోరాడుతారు. కర్షకుడు భూస్వామినీ వడ్డీవ్యాపారినీ ఎదిరించి, వితంతువు సనాతనాచారాన్ని ఎదిరించి, అస్పృశ్యుడు పురోహితుణ్ణి ఎదిరించి పోరాడుతారు. ప్రేంచంద్ తన విప్లవ తీవ్రతతో భారతదృశ్యాన్ని మారుస్తాడు. ఆయన చిత్రించినది నోరులేని పశువులు కాదు. అది విజయంవైపు ముందుకు సాగిపోయే లక్షలాది జనంతో నిండిన చిత్రం.

ప్రేంచంద్ అనేకమైన కథానికలు వ్రాసినాడు. నవలల్లో కనుపడే భారతదేశ దృశ్యమే ఈ కథలలోను కనుపడుతది. వీటిలో సమాజపు వాస్తవిక చిత్రం కనుపడుతది. తమ తమ జీవిత పరిధులలో ఉదాత్తంగా సంచరించే గొప్ప స్త్రీ

పురుషులు ఇందులో ఉన్నారు. ఈ కథలలో అత్యుదాత్తమైనవి ప్రేంచంద్‌కు చాలా ఇష్టమైన 'బడేఘర్కీ-బేటీ,' 'పంచ్ పరమేశ్వర్' 'ఈశ్వరీయన్యాయ' 'నమక్ కా దారోగా' మొదలైనవి కొన్ని. కొన్ని ప్రముఖమైనట్టి ఉదాహరణ ప్రాయమైనట్టి చిత్రీకరణలు బూఢీ కాకీ, కజాకీ, ఆత్మారాం లేదా 'ఈద్‌గాహ్'లోని ముసలి నాయనమ్మ వంటివి ఉన్నవి, చరిత్ర భూమికలో పోతపోసిన 'క్షమా' 'రాణీ సారంధా' 'రాజా హర్‌దౌల్' వంటి కథలున్నవి. 'పూస్ కీ రాత్' 'సవా సేర్ గెహూఁ' 'రాకుర్‌కా కుఁ' 'ము క్తిధన్' 'సద్గతి' వంటివి కరుణా పూరితమూ తీక్ష్ణబాధాయుతమూ ఐన గల్పికలు. దేశభక్తి పూరితమైన 'సమర్ యాత్ర' వంటి కథలున్నవి, మోటేరాంశాస్త్రి 'వంటి వ్యంగ్య చిత్రణలున్నవి. భారతీయుల జీవితంలోని అందమైన వేడుకలు బాధాకరమైన ఆచారాలు ఎంతో స్పష్టంగా శక్తివంతంగా తీవ్రంగా ఆయా కథలలో ప్రేంచంద్ చిత్రించినాడు.

విడిపోయే కుటుంబాలు, అమ్మమ్మగూర్చి తహ తహ పడే చిన్నపిల్లవాడు, అత్తమామల వద్ద ఉండిపోయి అవమానాలకు గురి అయ్యే అల్లుడు. చిట్టిగోనె ఆట, గ్రామానికి తల నాలుకైన ఆడుబిడ్డ, జీవితమంతా అదేపనిగా ఇతరుల శీలాన్ని కించపరచే భయంకరమైన ముసలిదీ—అందరూ ఉన్నారు. హీరా, మోతీ అనే ఎద్దుల కథ, గ్రుడ్డి సిద్ధాంతాలు మూఢ విశ్వాసాలు గల కథలు 'షత్రంజ్ కే ఖిలాడీ' వంటి కనుమరుగై పోతున్న యుగపు చిత్రణ కూడా ఉన్నవి. అన్ని విధాల వెనుక పడిపోయి, అన్యాయాలను ఎదిరించి పోరాడే ప్రేరణ గల భారతీయ హృదయపు లోతులు మనకు వీటిలో చాలా స్పష్టంగా కనుపడుతవి.

ప్రేంచంద్ తాను వ్రాసిన చాలా కథలలో అహంభావానికీ ఉదాత్తతకూ మధ్యన మానవహృదయంలో జరిగే ఘర్షణను చిత్రిస్తాడు. చిట్టచివరకు ఉదాత్త భావనే గెలుస్తది. ఆయన నిర్మొగమాటంగా వాస్తవాన్ని చిత్రిస్తాడు. కాని ఆయన ఆదర్శవాదం జీవితానికి గమ్యాన్ని నిర్దేశిస్తది. అందుకే ఆయనకు తాను వ్రాసిన కథానిక లన్నింటిలో 'బడే ఘర్కీ- బేటీ' చాలా నచ్చింది.

ప్రేంచంద్ తాను కథలు ఏవిధంగా రచించినాడో లాహోర్‌లోని ఒక పత్రికకు సమాధానంగా వ్రాస్తూ ఇట్లా అన్నాడు. "నా కథలు ఎక్కువగా ఏదో అనుభవం మీదనో ప్రేరణమీదనో ఆధారపడి ఉంటవి. వాటిలో నాటకీయ వాతావరణం చొప్పించటానికి నేను ప్రయత్నిస్తాను. అంతే కాని ఏదో ఉపాఖ్యానం చెప్పటానికి నేను కథవ్రాయను. కథలో ఏదో మనోధార్మిక సత్యమో లేదా తాత్త్విక~

సత్యమో ప్రదర్శించటం నాకు ఇష్టం. అటువంటి ఆధారం ఏదో కనుగొనేవరకు నా కలం సాగదు.''

'మధుకరి' కథానికల సంపుటం వ్రాసిన వినోద్‌శంకర్‌కు వ్రాస్తూ ప్రేంచంద్ సాహిత్య ధ్యేయాన్ని నిర్వచించినాడు. ''నా అభిప్రాయంలో—అందరి అభిప్రాయంలోను - సాహిత్యానికి - పరిపుష్టి, వినోదం, చిత్రణం అనేవి మూడు ఉద్దేశాలు. కాని రచనా పద్ధతి వినోదం - ఈ రెండూ పరిపుష్టిలోనే చేరుతవి. హాస్యకాళ్లు, మూర్ఖులు ప్రదర్శించే వినోదం కంటె రచయిత కలిగించే వినోదం భిన్నమైనది. అది పరిపుష్టి భావనను అలముకొంటది. దాని వివరణం కూడ తన ఉదాత్త ఆదర్శాన్ని విస్మరించదు.''

వినోద్‌శంకర్‌వ్యాస్‌కు వ్రాసిన మరొక జాబులో ప్రేంచంద్ ఇట్లా అంటాడు. ''కథలకు ఇతివృత్తాలు జీవితంనుండే ఎంచుకోవాలెనని నాకోరిక. అవి జీవితసమస్యలను పరిష్కరించేవిగా ఉండాలె. కవిత్వం చేసే పని కథ చేయటం నాకు ఇష్టం లేదు. కథ కంటె ఎక్కువగా వచనపద్యం హృదయతంత్రులను మీటుతది. ఎందుకంటే అది ఆధ్యేయంతో వ్రాసిందే కనుక. కాని దాని తాకిడి చెవిని స్పృశించి కొంత చక్కిలిగింత కల్పించి మాయమైపోయే సంగీతధ్వని వంటిది. కథ నీ యెదుట సజీవమైన పాత్రలను ప్రదర్శిస్తది.''

## XIII

ప్రేంచంద్ రచనలలోని శక్తి జీవితంమీది విశ్వాసంలోను వాస్తవమైన భారతదేశ చిత్రణంలోను ఉన్నది. పట్టణాలలో, పల్లె పట్టులలో, పొలాలలో, మైదానాలలో, ప్రధానమార్గాలలో, ప్రక్క దారులలో, సందులలో గొందులలో, చిన్న చేనులలో, కూలిన గుడిసెలలో ఉండే భారతదేశాన్ని ఆయన చిత్రించినాడు. తన కలం బలంతో ప్రేంచంద్ ఈ జీవితాన్ని మార్చాలెననుకున్నాడు. చాలా వరకు కృతకృత్యుడైనాడు కూడ. ఆయన మాటల మూలంగా ఆయన పాఠకుల ఆలోచనా ధోరణి ప్రభావితమై పోయింది.

విప్లవాత్మక ఆలోచనలతో ప్రేంచంద్ అనంతరూపాలతో ఉన్న అన్యాయాన్ని దుర్మార్గాన్ని ఎదిరించి దెబ్బతీసినాడు. ప్రభుత్వోద్యోగం చేస్తున్నా, ఆయన విదేశీయపాలనలో ఉన్న నైచ్యంమీద ధైర్యంగా దెబ్బ తీసినాడు.

కర్షకుల పక్షాన కార్మికుల పక్షాన, పురోహితులకు విరుద్ధంగా అస్పృశ్యుల పక్షాన సాంఘికదౌర్జన్యపరులకు విరుద్ధంగా బాధలకు గురియైన స్త్రీలపక్షాన ఆయన నిల్చినాడు. వివిధ రూపాలతో ఉన్న నిరంకుశత్వాన్ని ఆయన ద్వేషించినాడు.

ఆయన వ్యుత్పన్నుడైన హేతువాది. సనాతనాచారాన్ని, మూఢాచారాలను, గ్రుడ్డి నమ్మకాలను గట్టిగా నిరోధించినాడు. సనాతనసంప్రదాయాలకు దాసులైనవారు ఏవగించుకొనే ప్రగతిశీలి ప్రేంచంద్. వాళ్లు ఆయనను పలుమార్లు నిందించినారు కాని ఆయన బలంగా కఠోరంగా ఎదురుదెబ్బ తీసినాడు.

ప్రేంచంద్ గాంధీమార్గ ప్రభావితుడైనాడు. గోఖ్లే భావాలనుండి సమూలమైన మార్పులు కోరే భావాలకు దగ్గరైనాడు. క్రమంగా ఆయన సామ్యవాద దృక్పథంవైపు ప్రయాణం సాగించినాడు. పొలంలో కాని కర్మాగారంలో కాని ఎటువంటి అన్యాయం జరిగినా దానికి ఆయన వ్యతిరేకి. నిగమ్‌కు వ్రాసిన ఒక జాబులో "దాదాపు బోల్షివిక్ భావాలు అంగీకరిస్తున్నాను" అని చాటినాడు. "అట్టడుగున నలిగిపోయినవారికి రాజకీయవిద్య గరపటమే ధ్యేయమైన రాబోయే పార్టీకి చెందిన వాణ్ణి" అని చాటినాడు.

ఆయన స్వరాజ్యంగురించి శివరాణీదేవితో మాట్లాడుతుండేవాడు. "స్వరాజ్యం వచ్చిన తరువాత దోపిడి ఉండదా?" అని ఆమె అడిగింది - ఆయన ఇట్లా సమాధానం చెప్పినాడు. "ప్రతిచోట ఎంతోకొంత దోపిడి ఉన్నది. బలవంతులు బలహీనులను అణచటమే జీవితవిధానమేమో. ఐనా రష్యా ఉన్నది. అక్కడ ధనికవర్గాన్ని రూపు మాపినారు. ఈనాడు అక్కడ పేదజనం సంతోషంతో ఉన్నారు. బహుశః మనకు ఇక్కడ కూడ రష్యావంటిదే రావచ్చు."

బనారసీదాస్‌చతుర్వేదీకి వ్రాసిన జాబులో ప్రేంచంద్ తన కోరికలు ఆకాంక్షలు ఇట్లా వివరిస్తాడు. "నాకు ఏ కోరికలు లేవు. స్వాతంత్ర్య సమరంలో మనం గెలువాలెనన్నదే ప్రస్తుతం నాకున్న పెద్దకోరిక. నాకు కీర్తిమీద గాని డబ్బుమీదగాని అపేక్ష లేదు. తిండికి చాలినంత నాకు దొరుకుతున్నది. ఒక కారు కావాలెననికాని ఒక బంగ్లా కావాలెననికాని నేను కోరను. కాని శక్తివంతమైన కొన్ని రచనలు చేయాలెననే కోరిక ఉన్నది. ఐతే వాటి ధ్యేయం కూడ స్వాతంత్ర్యసముపార్జనమే.... ప్రశాంతంగా బ్రతుకాలెననే కోరికకూడ నాకు లేదు. ఎల్లప్పుడూ సాహిత్యానికీ దేశానికీ ఏదైనా చేయాలెననే కోరిక ఉన్నది."

ఇంద్రనాథ్‌మదన్‌కు వ్రాసిన జాబులో ప్రేంచంద్ తన ప్రాథమికవిశ్వాసాన్ని నిర్వచిస్తాడు. ప్రపంచంలో దాక్షిణ్యపాలనం అనే దానిలో ప్రేంచంద్‌కు ఎన్నిటికి నమ్మకం కలుగదు. ఆయన ఇట్లా వ్రాస్తాడు. "అన్నిటిని మించిన శక్తి ఏదో ఉన్నదని నేను ఇంతకు పూర్వం నమ్మేవాణ్ణి. అది నా ఆలోచనా ఫలితం వలన కాదు; కేవలం సంప్రదాయంలోని నమ్మకంచేత. ఆ నమ్మకం

ఈనాడు తుత్తునియలై పోయింది. నిస్సందేహంగా ఈ విశ్వానికి వెనుక ఏదో శక్తి ఉన్నది. ఐతే మనుష్య వ్యవహారాలతో దానికేదో సంబంధం ఉన్నదని నేను నమ్మను. చీమలతో దోమలతో ఈగలతో దానికి ఎట్లా సంబంధం లేదో మనుష్యులతోను అంతే. "

జైనేంద్రకు ఈవిధంగా వ్రాసినాడు. "నా జీవితం అధ్యయనంతోను, వైజ్ఞానిక సంభాషణలు వినటంతోను గడిచింది. నాకు దేవునిలో నమ్మకం లేదు, భక్తి లేదు. నీవు ఆస్తికుడవై పోతున్నావు. భక్తుడుగా ధ్రువపడుతున్నావు. నేనేమో సందేహస్థితినుండి నాస్తికత్వంవైపు సాగి వస్తున్నాను "

ఒక కథలో ప్రేంచంద్ ఒక పాత్రనోట ఇట్లా అనిపిస్తాడు. "ఈ ప్రపంచంలో దేవునికంటె క్రూరుడు మరొకడు ఉండడు. తన ఆట బొమ్మలనే, వాటి తప్పిదాలకు చెడుగులకు, నరకపు మంటలలోనికి త్రోసి శిక్షించే దేవుడు దయాపరుడు కాజాలడు. దయకంటె నిర్దాక్షిణ్యమే దేవునిలో వేయిరెట్లు ఎక్కువ. నేను అటువంటి దేవుని భావననే అసహ్యించుకుంటాను."

ప్రేంచంద్‌కు జీవితమంటే విశ్వమంటే ఉన్న ప్రాథమిక విశ్వాసాలు అటువంటివి. అవి ఆయన కళకు ఆధారాలు. ఈ గట్టి పునాదులమీదనే ఆయన సృజించిన సాహిత్యమనోహరభవనాలు నిలిచి ఉన్నవి. ఆయన భావాలే ఆయన రచనలకు ప్రేరకశక్తులు. వీటన్నింటిలో మనం ప్రేంచంద్‌ను గోర్కీతో పోల్చవచ్చు. గోర్కీవలె ప్రేంచంద్ ప్రజారచయిత. కళ అనే మహాయుధంతో సాధారణ మానవజీవితాన్ని మలచాలెననే కోరికలోనే వాళ్ళశక్తి ఉన్నది. అందుకే ఆయన రచనలలో సౌందర్యంకంటె బలమూ శక్తీ ప్రధానగుణాలుగా కనుపడుతవి. అందుకే ఆయన రచనలలో స్త్రీత్వగుణాలైన సౌకుమార్యము, సాధుత్వము, గేయత్వములకంటె మగతనపు గుణమే హెచ్చు.

ఆయన రచనలలో అక్కడక్కడ - 'మూఠ్' 'నాగ్‌పూజా' 'మంత్ర' వంటి కథలలోను, కాయకల్పలోని కొన్ని భాగాలలోను పారమార్థికభావాలు చోటు చేసుకొన్నవి. కాని ఆయన అటువంటి ప్రభావాలు గట్టిగా దులుపుకొంటూవస్తూ తరువాతి రచనలలో సంపూర్ణహేతువాదిగానే నిలిచిపోయినాడు. ఆయన పూర్తిగా మొండిపట్టుగల నగ్నసత్యాల మనిషి. వ్యర్థభావనలమూలంగా తన ధ్యేయంనుండి తప్పుదారిన పడ్డవాడుకాడు.

బహుళపాఠకలోకానికి అందుబాటులో ఉండే కోరికతో ప్రేంచంద్ సాధారణమూ సులభమూ - ఐనా శక్తివంతమైన మాధ్యమం - కొద్ది మార్పులతో హిందీకాని ఉర్దూకాని అనిపించే భాషను మలచుకొన్నాడు. అది దారిలో ఏ అడ్డూ ఆటంకమూ ఎరుగక ప్రవహించే నది వంటిది. ప్రేంచంద్ శబ్దాలను ప్రేమించే

వాడు. వాటిని ఆయన స్వేచ్ఛగా వాడినాడు. ఆయన కళలోని ఇతర అంశాల వలెనే ఆయనశైలి అలంకారాలకంటె శక్తి, బలమూ విశేషంగా కలది.

ప్రేమచంద్ భారతదేశంలోని రెండు పెద్ద మతాలవాళ్లు సన్నిహితం కావాలెనని కోరినట్లే హిందీ ఉర్దూ భాషలుకూడ సన్నిహితం కావాలెనని కోరినాడు. ఇస్లాంలో ఆయనకు ఉదారబుద్ధులు కనుపడ్డారు. చివరి దినాలలో ఆయన స్వయంగా ఒక ముస్లిం ప్రేమానురాగాలకు పాత్రుడైనాడు. ప్రేంచంద్ అత్యుత్తమ కథలలో 'క్షమా' ఒకటి. ఇందులో తన కొడుకును చంపిన క్రైస్తవుణ్ణి ఒక ముస్లింతండ్రి తన మతంవాళ్ళకోపంనుండి కాపాడుతాడు. ప్రేంచంద్ మతాతీత ఆదర్శంలో నిజమైన నిష్కళంకమైన నమ్మకం కలవాడు. ఈ మాట పుట్టకముందు చాలాకాలం పూర్వమే ఆయన ఆచరించినవాడు.

# XIV

ప్రేంచంద్ మరణానికి కొద్దికాలం పూర్వం వ్రాసిన రచనలు ప్రధానంగా 'మహాజనీ సభ్యతా' అనే వ్యాసం 'మంగళసూత్ర' అనే అసంపూర్ణనవల రచయితగా ఆయన మరణ శాసనాలు. ఆయన ఆత్మకు వారసులమైన మనం తప్పటడుగులు వేస్తున్నప్పుడు ఆయన మాటలలో మార్గాదేశం చేసే దీపస్తంభాన్ని చూడగలము. ప్రేంచంద్ రోగశయ్యమీద ఉండి వ్రాసిన రచనలు ఇవి.

'మహాజనీ సభ్యతా' అనే వ్యాసంలో ప్రేంచంద్ ఆధునికసంఘంలోని చెడుగులన్నింటికీ లాభకాంక్షయే కారణం అని నిందిస్తాడు. ఆయన ఇట్లా అంటాడు: "ఈ ధనికవర్గ సంస్కృతిలో ధనమే సమస్త సంచలనానికి ప్రధాన ప్రేరకం. ధనికవర్గం, బాంకర్లు పెద్దలాభాలు గడించటానికే పరిపాలన జరుగుతున్నది. ఈ దృష్టితో చూస్తే ఈనాడు బాంకర్లే ప్రపంచాన్ని ఏలుతున్నారు. మానవసంఘం రెండు విభాగాలుగా చీలిపోయింది. కష్టపడి పనిచేసేవాళ్ళది పెద్ద విభాగం. తమశక్తి పలుకుబడులతో పెద్ద విభాగాన్ని బానిసలుగా చేసుకొన్నవారిది చిన్నవిభాగం. ఆ పెద్ద విభాగంపైన వీళ్ళకు సానుభూతి దయ లేదు. పెద్ద విభాగం ఉన్నది కేవలం తమ యజమానులకోసం, చెమటోడ్చటానికి, వాళ్ళ కోసం తమ రక్తం ధారపోయటానికి, ఎన్నడో ఒకనాడు సడిచప్పుడు లేకుండా ఈ జీవితంనుండి నిష్క్రమించటానికి మాత్రమే...."

దూరదేశంలో ఒక నూతన నాగరకతావిర్భవంలో మానవసంఘానికి క్రొత్త ఆశ ఉదయించటాన్ని ప్రేంచంద్ చూచినాడు.

"దూరపశ్చిమంలో క్రొత్త నాగరకతాసూర్యుడు ఉదయిస్తున్నాడు. అతడు ధనికస్వామ్యాన్ని కూకటివేళ్ళతో పూర్తిగా పెరికినాడు. ఈ నాగరకత వెనుక ఉన్న ప్రాథమిక సూత్రం ఏమంటే: శారీరకకష్టం ద్వారా కాని బుద్ధిచేతకాని ఏదో ఒకటి సృష్టించే ప్రతిపౌరుడు సంఘంలో సభ్యుడుగా గౌరవం పొందగలుగుతాడు. మరొకరి కష్టం బలం మీద ఇతరులపై ప్రభుత్వం నెరపేవాళ్లూ, తాత

తండ్రులు కూడబెట్టిన ఆస్తులుగలవాళ్లూ అంతా హేయమైనవాళ్లు. అటువంటి వాళ్ళకు ప్రభుత్వవిషయాలలో తమ అభిప్రాయం ప్రకటించటానికి ఎటువంటి హక్కూ లేదు. వాళ్ళకు ఎటువంటి పౌరసత్వపు హక్కూ ఉండగూడదు ధన వంతుడు ఈ తాకీదితో కోపాన తనగొంతు ప్రపంచంలోని ఇతర ధనికవర్గాల గొంతులతో కలుపుతాడు ; దాన్ని శపిస్తాడు. . . ''

ప్రేంచంద్ తన జీవితంలో పేదరికాన్నే భరించినాడు సిరిసంపదలతో తులతూగే జీవితం ఆయన కోరుకోలేదు. అయన విధి సైనికుడు. ఓడిపోయిన ధ్యేయాల పక్షాన కత్తి దూసినాడు. ఆయన సిరి సంపదలనే పెద్ద గాలి యంత్రాలమీద దాడి చేసిన డాన్ క్విక్సాట్. ప్రేంచంద్ ఈ ఆదర్శమే ఆయన రచనల వెనుక ఉన్న బలము ప్రేరణ. గర్భస్థ పిండంవలె అసంపూర్ణంగా మిగిలిపోయిన ఆయన చివరి రచనలో ప్రేంచంద్ తన విశ్వాసాన్ని మళ్లా ఒకసారి నిర్వచిస్తాడు. తన చివరి నవల ' మంగళసూత్ర ' లో ఆయనే నాయకుడు.

' ఆయనది గొప్ప మనస్సనేది ఎవరూ నిరాకరించరు. అతని సహాయం కోరి లేదనిపించుకోవటం అసంభవం . సాహిత్య సేవతో తప్ప అతనికి ఇంకెందు లోను ఆసక్తి లేదు. దానికి డబ్బు లేదు. ఆయనకు కీర్తి లభించినమాట నిజమే. ఇది ఆతని ఆత్మతృప్తికి చాలు. కూడబెట్టటంలో అతనికి నమ్మకం లేదు ... ఆయన ఆత్మగౌరవంతో బ్రతుకదలచినాడు. అంతకంటె వేరే ఏమీ లేదు నిశ్చయంగానే ఆయనకు కొంత అహంకారం ఉండేది. కావలిస్తే దానిని మీరు గర్వమనండి. అది సాహిత్యోపాసకు లందరికీ సామాన్యమే. .'

ఆయన సొంత మాటలలో ప్రేంచంద్ అట్టివాడు. ఇది కళాకారుడు తన చిత్రాన్ని తానే వేసుకొన్నదిగా భావించవచ్చు. సాధారణమూ స్వాభావికమూ ఐన జీవితం గడపిన ప్రేంచంద్ తాను మొదట చూచిననాటికంటె తాను వెళ్ళిపోయే నాటికి భారతదేశం సంపన్నంగా శక్తివంతంగా ఉడటం చూసినాడు. 1880 ప్రాంతాలలో ఉన్నవాళ్ళంతా మితవాదనాయకులు. ప్రజావేదికలనుండి ధైర్యమైన ఉపన్యాసాలు చేసి స్వాతంత్ర్యార్జనకు అంతకంటె ఎక్కువ ఏమీ అవసరం లేదను కొనేవారు. 1936 సంవత్సరం భారత దేశానికి అదృష్ట నిర్ణాయకము అది క్రొత్త ఆశలు కోరికలు ఉదయించిన సంవత్సరం. ఆనాటికి భారతదేశం గట్టిగా ముందుకు పోసాగింది. పెద్ద పెద్ద అంగలు వేస్తూ తన ధ్యేయమైన సాంఘిక ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యం వైపు సాగింది. ఈ దిశలో పురోగమించటానికి ప్రేంచంద్ రచనలు శక్తివంతమైన సహాయం సమకూర్చినవి. భారతదేశం ఈనాడు ఈ స్థితికి రావ టానికి ఆయన రచనలు ముఖ్యాంశాలైనవి. భారత దేశగమ్యాన్ని తీర్చటంలో ఎన్నో ఇతర శక్తులు పనిచేసినవి. ఈ నాటి మన జీవితాన్ని దిద్దటంలో ఆయన రచనలు కూడ సహాయకారి శక్తులైనవి.

## ఉపయుక్త గ్రంథసూచి




1. ఖలమ్ కా సిపాహీ — అమృత్‌రాయ్
2. ఖలమ్ కా మజ్దూర్ — మదన్‌గోపాల్
3. ప్రేంచంద్ ఘర్ మేఁ — శివరాణీ ప్రేంచంద్
4. 'జీవన్‌సార్' - హంస: ఆత్మకథాంక్
5. హంస: స్మృత్యంక్
6. ప్రేంచంద్ స్మృతి
7. చిఠ్ఠీ పత్రీ (రెండు సంపుటాలు)
8 వివిధ ప్రసంగ్ (మూడు సంపుటాలు)
9. ప్రేంచంద్ రచనలు :



ప్రేంచంద్ జీవితానికీ రచనలకూ సంబంధించిన పెక్కు విషయాలను సేకరించటంలో శ్రీ అమృత్‌రాయ్ వ్రాసిన ఖలమ్ కా సిపాహీ, శ్రీ మదన్‌గోపాల్ రచించిన ఖలమ్ కా మజ్దూర్, శ్రీమతి శివరాణీ ప్రేంచంద్ వ్రాసిన ప్రేంచంద్ ఘర్‌మేఁ మొదలైనవి బహుధా తోడ్పడినవి. రచయిత, ప్రకాశకులూ వారికి కృతజ్ఞులు.

# ఉపయుక్త గ్రంథసూచి




1. ఖలమ్ కా సిపాహీ — అమృత్‌రాయ్
2. ఖలమ్ కా మజ్దూర్ — మదన్‌గోపాల్
3. ప్రేంచంద్ ఘర్ మేఁ — శివరాణీ ప్రేంచంద్
4. 'జీవన్‌సార్' - హంస: ఆత్మకథాంక్
5. హంస: స్మృత్యంక్
6. ప్రేంచంద్ స్మృతి
7. చిఠ్ఠీ పత్రీ (రెండు సంపుటాలు)
8 వివిధ ప్రసంగ్ (మూడు సంపుటాలు)
9. ప్రేంచంద్ రచనలు :


ప్రేంచంద్ జీవితానికీ రచనలకూ సంబంధించిన పెక్కు విషయాలను సేకరించటంలో శ్రీ అమృత్‌రాయ్ వ్రాసిన ఖలమ్ కా సిపాహీ, శ్రీ మదన్‌గోపాల్ రచించిన ఖలమ్ కా మజ్దూర్, శ్రీమతి శివరాణీ ప్రేంచంద్ వ్రాసిన ప్రేంచంద్ ఘర్ మేఁ మొదలైనవి బహుధా తోడ్పడినవి. రచయిత, ప్రకాశకులూ వారికి కృతజ్ఞులు.